# పీ ఠి క.

"నరవర నీచే నాచే
వరమడిగిన కుంతిచేత • వాసవుచేతన్
ధరచే భార్గవుచేతన్
అరయంగాఁ గర్ణుఁ డీల్గె • నార్గురచేతన్."

అనుచాటువు వినవచ్చుచున్నది. కాని భూదేవి కర్ణున కొసంగిన శాపమెట్టిదో భారతమున నెచ్చటను గానరాదు. మరియు నీపద్యమున శల్యుని ప్రస్తావన యెందును గానరాదు. ఈపద్యమునకు తుల్యమైన పద్యము మహాభారతము శాంతిపర్వములో నొక్కటి గలదు. అద్దానిని గూడ నిందు బొందుపరచియున్నాను.

కర్ణుని చారిత్రమును రూపకముగా వ్రాయవలయునని సంక ల్పించి యెట్లో యిద్దానిని బూర్తి గావించితిని. చదువరులు యింత దోషముల గణింపక యొప్పులనే పరిగ్రహింప ప్రార్థితులు.

కాకినాడ,
20—10—35.

ఇట్లు,
మ. శ్రీరామమూర్తి క

# సవరణ.



| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 13 | 13 | నవినీతులకు దేలి | నవినీతులకు దేరి |
| 27 | 13 | | గీ భూమిక్రుంగిన చక్రంబు ♦ భుజముతోడ<br>యెత్తుకొనగోరి నీవ్రున♦రించు నట్టి<br>యత్నములు వేగ వ్యర్థంబు♦లగుట జేసి<br>పగతు బాణంబులకు నోటు ♦ వడెదు గాక.<br>(ఈపద్యమును చేర్చుకొనవలయును.) |
| 39 | 19 | ♦దాపున కేనరుగంగలేను | ♦దాపున కేగగజాలనింక |
| 40 | 14 | నే ♦ నోడుదునని | తా ♦ నోడుదునని |





# దానవీరకర్ణ

శ్రీ

## ప్రథమాంకము.

### ఒకటవ రంగము.

నాంది.

ఉ. శాంతినశించినన్ బరమ ♦ సాధుల కెగ్గులు సేయునట్టిదు
ర్దాంతులు వృద్ధినొందినను ♦ ధాత్రి జనించుచు దుష్టకోటి నొ
క్కింతటఁ ద్రుంచి లోకముల ♦ నేలు కృపాన్వితుఁడైన కృష్ణుఁ డ
త్యంతము యీసభాసదుల ♦ నారసి బ్రోచెడు గాక యెప్పుడున్

[ప్రవేశము:—శూరసేనుఁడు.]

శూ—వీరసేనా ! వీరసేనా ! పిలుచుచుండఁగనే పరుగిడుచుంటి వేల రమ్ము.

[ప్రవేశము:—వీరసేనుఁడు.]

వీర—మెల్ల మెల్లనఁ దప్పటడుగులు వైచుకొనుచు స్థూలకాయ మీడ్చుకొనలేక మెట్టతాఁబేటివలె నడుచు నీతోఁ గూడఁ జున్న—

శూర—ఇంతలో మించిపోవున దేమి ?

వీర—కురుకుమారుల యస్త్రవిద్యాప్రదర్శనము.

శూర—అందు చూడవలసిన విశేషము లేమైన నున్నవా ?

వీర—పేరునకుఁ దగియుండకపోతివని విచారించుచున్నాను. వీరులు తమ బాహుబలప్రకటన మొనరించుచుండ నాలోకింపనివాని జన్మ మెందులకు—ఇఁక పోవచ్చునా?

శూర—అట్లైన నన్నుఁగూడ నచ్చటికి దీసుకొనిపొమ్ము.

వీర—అయ్యయ్యో! నీతో నడుచుచు అచ్చటికిఁ బోవుటకంటె నింటికిఁ బోవుట మేలు.

శూర—ఏల?

వీర—అపుడే భీమదుర్యోధనుల మల్లయుద్ధము ముగిసినదనియు, అర్జునుఁడు రంగస్థలమున కరుదెంచుచున్నాఁడనియుఁ దెలియవచ్చినది. అందుచే తొందరగాఁ బోవుచుంటిని. ఇంక నన్నాపకుము.

(నిష్క్రమించును.)

శూర—లేడిపిల్లవలె మాయమైనాడు. కానిమ్ము. ఈమాత్రముపకారము సేయలేని వీనిపని పట్టింపకుందునా? నేను స్థూలకాయుఁడనఁట! పేరునకుఁ దగినవాఁడను కానఁట!—ఎంతగా గేలిచేసినాఁడు—ఊరక శ్రమపడు టెందులకు? అచ్చటి కేగినవారితోడనే వచ్చుచుందురు. వారివలన విశేషము లెఱింగెదఁ గాక. (నిష్క్రమించును.)

---

[తెర యెత్తఁబడును.]

రంగస్థలము.

[ఒకవంక ధృతరాష్ట్రుఁడు, విదురుఁడు, భీష్ముఁడు, కుంతి మున్నగువారున్న తాసనములపైఁ గూర్చుండియుందురు. ఒకవంక శిష్యులతో ద్రోణుఁ డాసీనుఁడై యుండును. అర్జునుఁడు రంగస్థలమున నిలువఁబడి యుండును.]

ద్రోణు—భళీ! యర్జునా! భవత్కోదండవిద్యాప్రదర్శన మపూర్వమై మమ్మెల్లర నపరిమితానందవార్ధి నిర్మగ్నుల గావించిన నిన్నె

యీకురుకుమారవర్గంబునసె కాదు-మచ్ఛిష్యవర్గంబునందు సాటి
లేని వీరాగ్రేసరుఁడవని నొక్కి వక్కాణించుచున్నాను.

సుయో—(ఆత్మగతమున) ఆచార్యునిపలుకులు ములుకులవలె హృదయ
మున నాటుచుండెను.

[ప్రేక్షకులలోనుండి కర్ణుఁడు లేచి]

కర్ణు—ఆచార్యోత్తమా!

ఉ. పాండవమధ్యముం డొకఁడె ♦ భారతభూమి ప్రసిద్ధు డిట్టియు
ద్దండుఁడు లేడటంచు శత♦థా వచియించితి రింతమాత్రపుఁ
బాండితి గల్గునేర్పరులు ♦ బాహుబలాధికు లెందఱెందఱో
యుందు రటంచెంగి యీకరణి ♦ నొక్కని బేర్కొన మీకు న్యాయమే?

భారతభూమి కీతఁడొక్కఁడే తలమానికమా? గారడివానివలె
నేర్పొ వినోదములఁ గావించియుండ-నయోనిసంభవులగు త
మాయర్జునుని బట్టువలె నుతింప న్యాయమా?

సుయో—(ఆత్మగతము) ఆచార్యునకుఁ దగినట్లు వచించినాడు.

ద్రోణు—రాధేయా! కౌంతేయనికాండాశనవిద్యాకౌశలమునకు
నగ్గించుచుంటినని నీవు తలంపనేల? అతఁ డొనర్చిన విద్యాప్ర
టనము గావింప నింకెవ్వరు సమర్థులో వక్కాణింపరాదా?

కర్ణు—పేర్కొను టేల? ఇదే పరికింపుఁడు.

(అని యర్జునుఁ డొనర్చిన విద్యాప్రదర్శనములఁ గావించును.)

సుయో—(కర్ణుని సమీపించి కౌఁగిలించుకొని) రాధేయా! ఈక్షణం
నుండి నాతో బద్ధసఖ్యుండవై నాకు హితం బాచరించుచు, స
రాజ్యభోగంబు లనుభవించుచుండుము.

కర్ణు—సుయోధనసార్వభౌమా! నీ కెల్లపుడును కృతజ్ఞుఁడనై మెల
గుచుందును.

సుయో—నీ వాపృథాపుత్రునితో ద్వంద్వయుద్ధంబు సల్పి నాకు హితంబు గావింపవలయును.

అర్జు—రాధేయా! పిలువనిపేరంటమునకు కరుదెంచి పరాత్మపరిమాణంబు లెఱుంగక వదరెదేల?

కర్ణ—పాండవమధ్యమా! ఆయాససంజనితహేతుభూతంబు లగు పల్కులతోఁ గాక నిశితాస్త్రపరంపరతోఁ బలుకఁ బ్రారంభింపుము.

అర్జు—గురుజనానుమతంబునకు నిరీక్షించుచుంటిని.

ద్రోణు—అర్జునా! తడవేల?

యుధి—పార్థా! రాధేయునకుఁ బ్రత్యుత్తర మొసంగుము.

(కర్ణార్జునులు కొంతతడవు ద్వంద్వయుద్ధము గావింతురు.)

ధృత—ఏమీ కోలాహలము!

విదు—కర్ణార్జునులు ద్వంద్వయుద్ధము చేయుచున్నారు.

ధృత—కర్ణుఁ డెవ్వఁడు?

విదు—అర్జునునితో మత్సరించి పోరాటమునకుఁ గాలుదువ్విన సూతనందనుఁడు. నీకుమారుండగు సుయోధనుఁ డాసూతపుత్రునితో సఖ్య మపేక్షించియున్నాఁడు. ఇప్పట్టున నీ వాతని మందలింపవలయును. నీచులతోడి సాంగత్య మనర్థదాయకము.

కుంతి—భీష్మద్రోణాదులారా! ఈయుద్ధమును వారింపలేరా? అతిదారుణంబగు నీపోరాటంబున నెవ్వారి కెట్టియుక్కట్టు గల్గునో వారింపుఁడు.

ధర్మ—తల్లీ! ఇదే మిట్లాడెదవు?

కుంతి—హా! దైవమా! (మూర్ఛిల్లును.)

ధర్మ—జననీ! నీ కేల యిట్టిపాటు గల్గెను?

విదు—పాండవాగ్రజా! భీభత్సకరంబగు నీయస్త్రవిద్యాప్రదర్శనమును దిలకింపలేక నీమె మూర్ఛాగత యైనది. త్వరలో స్వస్థత చేకూ

రఁగలదు. లెమ్ము వకుళా! కుంతీదేవి మూర్ఛిల్లియున్నది. అంతః
పురమునకుఁ గొనిపోయి శీతలోపచారము లొనరింపుము.

(వకుళ కుంతీదేవిని గొని నిష్క్రమించును.)

కృపా—కర్ణార్జునులారా! ఈపోరాట మెక్కింతతడవు నిలుపుఁడు.

(కర్ణార్జునులు యుద్ధ మొనరించుట మాని నిలుతురు.)

కృపా—కర్ణా! వియ్యంబును, కయ్యంబును, నెయ్యంబును, సమాను
లతో నొనరింపనగునని పెద్దలు వచింతురు. కావున—

చం. కులమును శీలమున్ గుణము ♦ గోత్రసమృద్ధియుఁ గల్గుపార్థుతోఁ
దలపడనెంచియున్న తలి ♦ దండ్రులఁ బేర్కొను మీవుఁగూడ స
త్కులజుఁడవేని జోడు సమ ♦ కూడును యుద్ధము సేయఁ గానిచో
నలఘుకులీనుఁడైన యల ♦ యర్జునితో నని సేయఁ జెల్లునే?

కర్ణు—(ఆత్మగతమున) తలవంపు ఘటిల్లెఁ గదా!

సుయో—ఆచార్యా! తమపల్కులు పక్షపాతసహితంబులై ప్రతిపక్షు
ల నొవ్వనాడునవియై యున్నవి. మత్సఖుండగు రాధేయుండు
భూపాలుఁడు గాఁడని తలంతురేని, ఇప్పుడు యీతని కంగరాజ
మొసంగి మూర్ధాభిషేకంబు గావించెదను.

విదు—ధృతరాష్ట్రసార్వభౌమా! అనర్థము సంభవింపనున్నది; కుమా
రుని వారింపుము. ముందెట్టివిపరీతంబులు గల్గునో యాలోచిం
చుకొనినైన నీకుమారు నీప్రయత్నమునుండి వారింపుము.

ధృత—(అపవారించి) ఇంతమాత్రంబునఁ గల్గినసష్ట మేమి? పనివడి
కుమారుని మందలింపకుండు నా?

(సుయోధనుఁడు కర్ణున కంగరాజ్య మొసంగి కిరీటమును ఖడ్గము
నొసంగును.)

కర్ణు—సుయోధనసార్వభౌమా!

గీ. గోత్రవర్ణాదుల సరకఁ ◆ గొనక నాకు
అంగరాజ్యాభిషేక మీ ◆ వాచరించి
గౌరవించితి విప్రుఁ డ◆ కారణముగ
యేవిధంబున నీఋణ ◆ మేను దీర్తు!

ఈయకారణవాత్సల్యమున కెట్లు నిన్ను సంతోషపరుపఁగలను.

సుయో—మిత్రమా! అంగరాజా! నీవు నాకు హితుండవై యుండు
టయే నాకు నీవొనర్పఁగల ప్రత్యుపకారము.

భీము—(పటాటోపముగా నవ్వుచు) కర్ణా! మంత్రపూతమై గురుయ
జమానభక్ష్యమగు పురోడాశము కుక్క కర్హమగునా? అంగ
రాజ్యేందిర నీయట్టిభర్తను బడసి ధన్యయైనది.

గీ. ఇన్నినాళ్లును భర్త ల◆భింపకునికి
నెంతో వగగుందు అంగరా◆జ్యేందిరకును
అహహా! నేఁటికిఁ దగిన నీ◆యట్టిభర్త
దొఱకె నింక ధన్యాత్మయై ◆ వఱలఁగలదు.

సుయో—భీమసేనా! నీమాటలు చాలింపుము. ఈతఁ డంగరాజ్యము
నే కాదు- చతుస్సముద్రముద్రితధరావలయంబును దనబాహు
బలంబునఁ బరిరక్షించి పాలింప సమర్థుండు.

ద్రోణు—సుయోధనా! భీమసేనా! వాక్కలహముల కెడమీయకుఁడు

గీ. వీరశేఖరులు తమ ప్రా◆వీణ్యమెల్ల
ప్రకటనము సేయ నిర్ణయ◆పరుపఁబడిన
రంగసీమను జగడమా◆డంగఁ దగదు
చాలు నేఁటి కీసభ నిల్పి ◆ శాంతిఁ గనుఁడు

భగవానుఁడగు జలజాప్తుఁ డస్తగిరి విశ్రాంతికై కొంట కరుగు
చున్నాఁడు. ధృతరాష్ట్రమహారాజా! కురుకుమారులు అస్త్ర

విద్యాప్రదర్శనమున సభ్యుల మెప్పించిరి. ఇంక నేఁటి కీసభ చాలింతుమా?

ధృత—మంచిది (అందఱును నిష్క్రమింపఁ దెర వ్రాలును.)



## రెండవ రంగము.

ప్రదేశము:—కర్ణుని శయనాగారము.

[ప్రవేశము:—కర్ణుఁడు.]

కర్ణ—కష్టా! నేఁటి సభారంగమున నెట్టియవమానమునకు గుఱియైతిని. కుంతీసుతమధ్యముండు పల్కినపల్కులు హృదయకుహరమును శతధా వ్రయ్యలు సేయుచుండెను. మంత్రపూతమై గురుజనమాన్యమగు పురోడాశము శ్వానమునకువలె యంగరాజ్యము నా కనర్హమైనదఁట!—మానధనుల కింతకంటె నెక్కుడగు నవమానము గావలయునా?—దుర్భరము! దుర్భరము!! నానాదేశాగతులగు భూపాలురు, వీరాగ్రేసరులు, రణశూరులు నగు వారందఱిసమక్షమున నేనొక హీనకులజుఁడ నని నిరూపింపఁబడితిని గదా? ఇంతటి దుర్భరావమానమునకు గుఱియయ్యు నా హృదయ మేల వ్రయ్యలు గాకున్నదో కదా! ఇట్టి యవమానమును తలఁదాల్చి మనుటకంటె నీగుఱ్ఱక్కెడుప్రాణ మెట్లో త్యజించుటయే యుత్తమము.

[ప్రవేశము:—సూతుఁడు, సుయోధనుఁడు.]

సుయో—మిత్రమా! అంగరాజా! అదే మట్లుఁటివి! నీమోము విన్నదనము గాన్పించుచున్న దేల?

సూతు—కుమారా! చింతాక్రాంతుఁడవై యుండుటకుఁ గతమేమి

అంగరాజ్యాభిషిక్తుండవైన నిన్ను అభినందింపవలయునని మీ జనని యెదురుచూచుచున్నది.

కర్ణు—జనకా! అంగరాజ్యము చేకూరినను కుంతీసుతమధ్యముం డాడిన సూటిమాటలు హృదయకుహరమును భేదింపకుండ విడచునా?

సుయో—మిత్రమా! రాధేయా! ఆవిషయికమగు విచారమునకు నీవు నీహృదయమున తావీయరాదు. విద్య యొక్కకులము వారి హక్కు గాదు.

గీ. క్షత్రియుఁ డొకండె యస్త్రశస్త్రములఁ దాల్ప
నర్హుఁ డగునంచు నాత్మలో ♦ నరయవలదు;
విద్య యొక్కని చేనున్న ♦ విత్తమగునె?
కులముతో విద్య కేమైనఁ ♦ జెలిమికలదె?.

సూతు—నాయనా! అంతపఱకేల? ధనురాచార్యుండని విశ్వవిఖ్యాతిఁ గన్న కుంభసంభవుండు విప్రుం డగుట నీ వెఱుంగవే.

కర్ణు—సాక్షాత్పరబ్రహ్మస్వరూపుండును, అయోనిసంభవుండును నగు వారలతో మనము సరిసూచుకొనవచ్చునా? నక్క యెక్కడ-దేవలోక మెక్కడ?

దుర్యో—మిత్రమా! అట్లు తలంతువనియేకదా యంగరాజ్యాభిషేక మొనరించి నాసోదరవర్గంబునఁ జేర్చుకొంటిని. ఇంక నీవు చింతింపవలసిన పనిలేదు.

సూతు—కుమారా! ఇంకొక్కవిశేష మెఱింగించెద నాలింపుము. నిన్నవమానపరుపఁగడంగిన యాపాండవులును, యమానిలయింద్రాశ్వినుల తనూజులు గాని పాండుపుత్రులు కారు, కావున-విద్యాధనంబు లింతయార్జించితి నీకిఁ జాలు నని తనియరాదను పెద్దలపల్కులఁ బాటించి విద్యాధికుండవగుటకు సర్వవిధంబుల యత్నింపుము.

దుర్యో—సూతునివచనంబులు గ్రాహ్యంబులు.

కర్ణ— జనకా! తమయానతి శిరసావహింతును.

సుయో—మిత్రమా! నీవలన వినవలసినమాట వినుటచే నానందరసాబ్ధివీచికల నూయలలూగుచుంటిని.

సూత—కుమారా! విద్యాధికుండవై, యసమానపాండిత్యసంపన్నుండని గర్వించు నాఖండలసూతి గర్వాతిరేకమును మాయించి, దశదిశల నీకీర్తిచంద్రికల వెదచల్లుము. రమ్ము- నీసందర్శనాభిలాషతో నెదురుచూచు జననిని సంతుష్టిపఱపుము.

ముగ్గురును బరిక్రమింతురు.

(కర్ణుఁడు, సూతుఁడును నిష్క్రమింతురు.)

---

మూఁడవ రంగము.



[క్రోధముతో నొకబ్రాహ్మణుఁడు ప్రవేశించును.]

బ్రా—ఔరా! దురాత్మా!

గీ. ఈవు నేర్చిన విద్యల ♦ నీవిధాన
నోరెఱుంగని పశువుల ♦ క్రూరబాణ
పంక్తిఁ గూల్పఁగా నుపయోగ ♦ పరుపనేల?
పరులు లేకుండ్రొ నీప్రతా ♦ పంబుజూప.

ఓరోరి! బాహుబలగర్వదుర్విదగ్ధా! క్రిందుమీఁదెఱుంగుక- సంచారబాహుళ్యముగల యీప్రదేశంబులయందా నీవు శస్త్రాభ్యాసము గావించుట! కానిమ్ము. స్వయంకృతాపరాధంబునఁ దగురీతి మత్క్రోధానలంబున భస్మావశేషుండవై రూపడంగెదవుగాక.

[ప్రవేశము:—తొందరతో నొకభటుఁడు.]

భటు—మహాత్మా ! క్షమింపవలయును.

బ్రాహ్మ—ఏమీ ! క్షమింపవలయునా ? ముష్టులు మూటఁగట్టు నీహోమధేనువత్సకంబును నిష్కారణముగా వధించిన నిన్ను క్షమింపవలయునా ? ఇంత కండకావరమా ! విప్రులన్న నీకింత చుల్కనై తినూ ? మూర్ఖా ! నిన్ను క్షమించుట !

భటు—దేవా ! ప్రమాదవశంబున నిట్లు జరిగెనేగాని వేఱొండు గాదు. అపరాధక్షమఁగోరునాతఁ డంగరాజగు రాధేయుండు.

బ్రాహ్మ—ఏమీ ! సూతసుతుండా యిట్టిదురంత మాచరించినది ? స్వపరతారతమ్యంబు తెలియంగక ననాయాసముగ నంగరాజ్యము లభించెఁగదా యని కన్నుమిన్నుఁ గానక- మదాంధుఁడై వర్తించు నారాధేయునకుఁ దగినట్లు బుద్ధి గఱుపవలయును. ఓరీ ! రాధాగర్భ సంభూతా ! ఎవ్వనిజయింప నీ వీశస్త్రాభ్యాసము చేయుచుంటివో, యాయర్జునునితో యుద్ధమాచరించునెడ నీరథచక్రము భూమిలో దిగఁబడుఁగాత.

ఉ. ఎవ్వని సంగరంబునను ♦ యిట్టి జయింపఁ దలంచియుంటివో
ఎవ్వనితోడ యుద్ధ మొన ♦ రింపఁగఁ బందువుగాఁగ నెంతు వా
కవ్వడితోడ సంగరము ♦ గల్గిన వేళల నొక్కపెట్టునన్
క్రొవ్విననీరథాంగ మది ♦ క్షోణితలంబునఁ గ్రుంకుఁగావుతన్.

[ప్రవేశము:—కర్ణుఁడు తొందరతో]

కర్ణు—భూమీసురాగ్రణీ ! క్షంతవ్యుఁడను. గతించినదానికిఁ జింతింప ఫల మేమి? గోసహస్ర మొసంగెదను. తమశాపము నుపసంహరింపుఁడు.

బ్రాహ్మ—గర్వాంధుఁడా ! యూరకొనుము. నీప్రగల్భవాక్యంబు

లేకఁ జాలింపుము. నీ వొసంగనెంచిన శతసహస్రగోగణంబైన నా హోమధేనువత్సంబునకు సాటి యగునా?

కర్ణ—మహాత్మా! అనుగ్రహింపవలయును. వజ్రవైడూర్యాదినవరత్న ఖచితంబులగు హాటకపల్యాణంబులతో నొప్పారు తురంగసహస్ర మొసంగెదను; శతసహస్రములగు మదమత్తేభయూధ మర్పించెదను; కనకశృంగంబులతో కన్నులకింపుగొల్పు గోకోటి నొసంగెదను; నాకుఁగల ధనసంపదులనెల్ల యొసంగెదను; నన్ననుగ్రహింపుఁడు. నాయపరాధమును క్షమింపుఁడు.

బ్రా—దుర్వినయాగ్రణీ! కర్ణా! నీచే దానము పరిగ్రహింతు ననుకొంటివా? పొమ్ము. నాశాపఫల మనుభవింపఁగలవు పొమ్ము.

(నిష్క్రమించును.)

కర్ణ—హా విధీ! బాల్యచాపల్యమున నట్టిటు గంతులువైచుచుఁ దనంతఁదా నరుదెంచి నాశిలీముఖంబున కాహుతియయ్యెనే కాని బుద్ధిపూర్వకముగా నద్దానిని వధింపకున్నను- విప్రుని శాపంబునకేను గుఱియైతిని. విధి యిట్లున్నది కాఁబోలును. లేకున్న యావత్సక మిట్లురుదెంచి మడియునా? కానిమ్ము. రథచక్రము మాటిమాటికిని దిగఁబడుచుండునని గదా శపించియుండెను. ఇంత మాత్రమునఁ గల్గు యపాయంబుండదు. ఎట్లైన నాయర్జునుని సాధింపఁదగు నుపాయ మాలోచింపవలయును.

(నిష్క్రమించును.)

ఇది ప్రథమాంకము.

---

# దానవీరకర్ణ

## ద్వితీయాంకము.

పరశురాముని యాశ్రమము.

[కృష్ణాజినముపై పరశురాముఁడు కూర్చుండియుండును. ఎదుట ముకుళిత కరకమలుఁడై కర్ణుఁడు నిలువఁబడియుండును. తెర యెత్తఁబడును.]

పర—ఓయీ! అనేకములగు విడుముల కోర్చి, యీ హిమాచలమున నున్న నాయాశ్రమభూమి కరుదెంచి, నను సందర్శింపఁదలంచుటలో నీయభిప్రాయ మేమో తెలియుటలేదు.

చం. ఇరువదియొక్కమాఱు ధర ♦ నీవలయంబున నున్నరాజులన్
పరసుహతిన్ దివంబునకుఁ ♦ బంపి, మహీతలమెల్ల నొక్కభూ
సురున కొసంగివైచి, ధన ♦ శూన్యుఁడనై తప మ్మాచరించు న
న్నరయఁగ వచ్చి యెట్టిశుభ ♦ మందెదవో వేగ మెఱుంగ జేయుమా?

కర్ణ—మహాత్మా! అర్థాపేక్షతోఁగాని, రాజ్యాపేక్షతోఁగాని తమ్ము సందర్శింప నరుదెంచియుండలేదు.

పర—అయిన నీరాకకుఁ గత మేమి?

కర్ణ—ఐశ్వర్య మపహృతమై నశించును; రాజ్యము అసామర్థ్యమున పరులపాలగును; కావున, తమవలన పరులచే నపహరింపఁబడనిదియును- తనువుతోఁగాని నశింపనిదియును—

పర—విద్యాభ్యాస మాసించి వచ్చియుంటివా?

కర్ణు—అవును. మహాత్మా! అవును. ముల్లోకైకవీరులగు తమవలన దివ్యాస్త్రములఁ బడయనెంచి యరుదెంచియుంటిని.

పర—నాయనా! ఈవిషయమున నీవు మిక్కిలి శ్రమపడి వచ్చియుంటివి. కాని, యొక్కవిషయమును దెల్పెద నాలింపుము. నీకీయస్త్రవిద్యతో నేమియును ప్రయోజనము లేదు.

కర్ణు—అట్లు సెలవీయఁ దగునా? విద్యాధనంబుతో సమమగునదేమైనఁ గలదా?

సీ. ఇతరుల కేవేళ ♦ నెంతెంత యొసఁగిన
తరుగు లేకుండునర్థంబు విద్య
నిర్జనాటవినైన ♦ నిలువ నీడ నొసంగఁ
జాలినయట్టి వృక్షంబు విద్య
అపహరింపఁదలంచు ♦ నవి నీతులకుఁ దేలి
చూడఁగారానట్టి ♦ సొమ్ము విద్య
బలమును వినియోగ ♦ పఱచినవారైన
గ్రహియింపలేనియర్థంబు విద్య
యెంత యార్జించియున్న సంతృప్తి నిడని
ధనము పరికింప విద్యయే; ♦ తల్లిదండ్రి
లేని విడుతురు గాని యార్జించినట్టి
విద్యయే కాదె తోడౌచు ♦ విడువకుండు.

ఏవిద్యనైనను సమగ్రముగ సాధించిన యాతఁడు వినయాదిసద్గుణసమన్వితుండై యుండడనుట నిక్కము గదా?

పర—నీముఖలక్షణములు పరికింపఁగా నీ వొకరాకుమారుఁడవనితోఁచుచున్నది. రాజులవిద్వేషి నగు నేను నీకు బాణవిద్య నుపదేశింతునా?

కర్ణు—(స్వగతము.) ఇప్పు డేమందును? కల్లలాడకున్న కార్యము గట్టెక్కదని తోచదు. మహాత్మా! నేను రాట్కులసంజాతుండను గాను. కావున తమరు సంశయింపవలసిన పని లేదు.

పర—నీవు విప్రుండవైన నీకీ యస్త్రవిద్యవలన ప్రయోజన మేమున్నది? వేటాడవలయునా? రాజ్యములను సంపాదింపవలయునా? నిరర్థకమైన యీవిద్యకై నీ వింతగా నుబలాటపడుటకు—

కర్ణు—దేవా! తా మెఱుంగని దేమున్నది. విద్యాధనము గడించుటలో నెంతశ్రమపడవలసివచ్చినను లెక్కింపఁదగదు గదా? నీ కీవిద్యతో నిమిత్త మేమని ప్రశ్నించితిరి. మనుజుఁడు నేర్వఁగూడని విద్య యున్నదా? ఆత్మసంరక్షణమునకు బ్రాహ్మణుఁడుమాత్ర మస్త్రవిద్య సంపాదింపరాదా? ద్రోణకృపాశ్వత్థామలు విప్రులు కారా? వారు మహావీరులై నిఖిలాస్త్రవిదులై యుండుట తమ రెఱుంగరే. కావున నన్ననుగ్రహించి, నాకును విద్యాదాన మొసంగుటకు మీపదసరోజము లంటి ప్రార్థించుచుంటిని.

పర—ఓయీ! నిష్కారణశ్రమకు లోనగుచుంటివని యింతదూరము వచింపవలసివచ్చెను. నీవు శస్త్రాభ్యాస మొనర్చుటకు కృతనిశ్చయుండవై యుండ నేనేల వారింపవలయును.

కర్ణు—అనుగ్రహింపఁబడితిని.

పరశు—లెమ్ము. నాయనుష్ఠానమునకు కాల మతిక్రమించుచున్నది. ఒక్క శుభముహూర్తమున నీకు మహాస్త్రముల నుపదేశించెదను. స్నానార్థ మరుగుదము రమ్ము.

కర్ణు—చిత్తము.

(నిష్క్రమింతురు.)

తెర పడును.

# ద్వితీయ రంగము.



పరశురాముని యాశ్రమము.

[ప్రవేశము:—కర్ణుఁడు.]

కర్ణ—మహానుభావుండగు నీతనివలన నేఁటి కనేకదివ్యాస్త్రములను బడ సితిని. ఇంక నీగురువర్యునిచెంత నేర్వవలసిన యస్త్రశస్త్రములు లేవు. కావున గుట్టు బయలుపడకుండ నెట్లో యిచ్చటినుండి వెడ లిపోవుటయే శ్రేయస్కరము. ఈతని కితరమతములవారిపై నెంతటిద్వేష మున్నదో పల్కులలోననే తెలియుచుండును. కావున నానిజవృత్తాంత మీతని కెఱుకపడకుండుటకు మున్నె యిచ్చటినుండి వెడలిపోవలయును. లేకున్న నన్ను మోసగించి విద్యాగ్రహణ మొనర్చితివని శపించిన శపింపఁగలఁడు. నిగ్రహా నుగ్రహాసమర్థుఁడు.

గీ. శాపచాపబలంబుల ♦ శక్తి కల్గు
యుగ్రకోపనుఁ డీతని ♦ నుత్సహింపఁ
జేసి నేఁట రేపట నెట్లొ ♦ సెలవు పొంది
హస్తినాపురీవరమున ♦ కరుగువాఁడ.

[తెరలో] రాధేయా ! రాధేయా!!

కర్ణ—ఎందులకో యామహానుభావుఁడు నన్నుఁ బిలుచుచున్నాఁడు. నేఁట రేపట నీతఁ డుల్లాసముగా నున్నసమయమున ననుజ్ఞఁ గొని హస్తినాపురంబున కరిగెదను. (ప్రకాశముగా) మహాత్మా ! వచ్చుచుంటిని. (నిష్క్రమించును.)

[ప్రవేశము:—మహేంద్రుఁడు]

మహేం—శ్రీమన్నారాయణుఁ డీపరమరహస్యమును నా కెఱిఁగింప కున్నయెడల మరల మరల నిక్కట్లకు లోనగుచుండవలసిన దే

కదా? అబ్బా! తలఁచుకొనునంతనే మున్నుపడినపాట్లు స్ఫురణకు వచ్చుటంజేసి యిప్పటికిని యొడలు జలదరించుచున్నది.

సీ. దిక్పతులను ముప్పు ♦ తిప్పలు బెట్టి యి
ల్లాండ్రతో నడవుల ♦ కంపినాఁడు
నందనారామంబు ♦ నందలి మందార
తరువు లన్నిఁటి వేగ ♦ నఱికినాఁడు
రంభాదిసురకాంత♦లను బల్మిమై బట్టి
ఎన్నియోవిధుల బా♦ధించినాఁడు
పరమమునీంద్రులఁ ♦ బట్టి బంధించుచు
యిచ్చవచ్చినటు లే♦డ్పించినాఁడు
స్వర్గలోకంబు నొక్కడ ♦ పాడుపఱచి
దివ్యసంపదల హరించె; ♦ దేవతలను
బానిసలవలెఁ జూచుచు ♦ బాధపెట్టి
చెప్పరానంత గగ్గోలు ♦ చేసినాఁడు.

ఇది చేసె నది చేసె నని యేల గణింపవలయును. ఆసహస్రకవచుఁడు చేయనిదుష్కార్య మొక్కటి కలదా? ముక్కోటిదేవతలును యెప్పు డాదుర్మార్గునివలన నెట్టియిక్కట్లు కల్గునో యని తమ తమ ప్రాణముల నఱచేతుల బెట్టుకొని దినములఁ గడపిరి గదా? ఆనాఁ డాతనిపీడ వదలించుకొనుటకై నాపడినబన్నములపరిమితములును, యసంఖ్యాకములు నై యున్నవనుటలో నతిశయోక్తి యెంతమాత్రమును లేదు. అదేమిచిత్రమో కాని, యీత్రివిష్టపాధిపత్యము దినదినగండము వేయేండ్లాయు వనినట్లుగా నున్నది. ఏరక్కసుఁడో యాబ్రహ్మదేవునిగూర్చియో, మహేశ్వరునిఁగూర్చియో తపస్సు చేయక మానఁడు. భక్త

పరాధీనులగు వారంతమాత్రమున నుబ్బి తబ్బిబ్బు జెంది వారము గూటయేతడున్నగా నడిగినవరంబులు నొసంగుచుందురు. ఇంతమాత్రమున వారికేమి కష్టమున్నది? బాధపడువాఁడను నేను. ఏలనన, వరములఁ బడసినతోడనే యారక్కసుఁడు తన మూకతో మున్ముందుగా నమరావతినే ముట్టడింప నరుదెంచుచుండును. అపుడు మా పాట్లా పరమాత్మునకే తెలియవలయును. ఆయిక్కట్లు కోర్వఁజాలక విష్ణుదేవునితో మొఱవెట్టుకొనఁగా నెప్పటికో- మా కొకింతయుపకారము చేయుచుండును. కాని, యీసహస్రకవచుని విషయములో మాత్రము నరనారాయణు లొకింత యుపేక్షించి యూరకొనిరి. అట్లుగాకున్న నేఁడు నేనీవిధమున విశ్వప్రయత్నముల సలుపవలసినపని లేదు గదా! (ముందునకుఁ జూచి) అదే- నాఁటి సహస్రకవచుఁడు నేఁడు కర్ణుఁడై జనించి యపుడే లోకోత్తరములగు నస్త్రశస్త్రములఁ బడసియున్నాఁడు. ఈసమయమున- నీతని నిజవృత్తాంతమును బయలుపఱచి పరశురామున కీతనియెడ నలుక వొడమునట్లు గావింపవలయును. లేనియెడల, నీతఁడు లోకైకవీరుఁడై ముల్లోకంబుల నొక్కసారిగా జయించి మాకెల్లరకును గొప్పయాపదలఁ గల్గింపఁగలఁడు. (ఆలోచించుచు ముందునకుఁ జూచి) అదే పరశురాముఁ డాతనితొడపై శిరముంచి హాయిగా నిదురించుచున్నాఁడు. మంచిసమయము లభించినది. ఇప్పుడ నే నేగి యాతనికి ప్రబోధము గలుగునట్లు గావించెదను.

(నిష్క్రమించును.)

తెర యెత్తఁబడును.

[కర్ణుఁడు కూర్చుండియుండును. పరశురాముఁ డాతనియంకమునఁ తల నిడుకొని నిద్రించుచుండును.]

కర్ణు—గురుదేవున కొంతలో నెంతనిద్దుర పట్టినది. అగును; మహాతపస్సంపన్నులగు నిట్టిమహానుభావులకుఁ దలచినంతలో నిదుర వచ్చుటలో వింత లేదు. దురహంకారులును, వ్యభిచారపిశాచావేశులును, పరవిత్తాపహరణంబునకై వ్యాకులాడువారికిని, నిద్ర రాదు గదా! (పరశురామునివంకఁ జూచుచు) ఎన్నియోవత్సరములనుండి సుఖనిద్ర యెఱుఁగనివానివలెఁ శయనించి గాఢముగా గుఱ్ఱుపెట్టుచున్నాఁడు. నేఁడు గురుదేవు లత్యుత్సాహముతో నుండిరనియు, వారియనుజ్ఞఁ గొని నేఁ నరుగవచ్చుననియుఁ దలంచితి నంతలోననే వీరి కిట్లు నిద్రామైకము గలిగెను. కానిమ్ము. వీరు మేల్కాంచినపిమ్మటనే నాయభిమత మెఱింగించెదను.

[ప్రవేశము:—మహేంద్రుఁడు.]

మహేం—(ఇంచుకదూరమున నిలిచి స్వగతమున) మంచిసమయమునకే యరుదెంచితిని. ఇప్పు డీమహానుభావునకు నిద్రాభంగము గల్గించితినా యీతనిపైఁ గోపింపక మానఁడు. భార్గవరామునకలుకగల్గినా కర్ణుఁ డిఁక నీలోకంబున నుండఁడు. కాని యెట్లీతని ప్రబోధింతును! (ఆలోచన మభినయించి) ఆ! స్ఫురించినది. అట్లొనర్చెదఁగాక (నిష్క్రమించును.)

కర్ణు—ఆహా! గురువర్యు లతిసుకుమారమైనశయనము నిట్టి యీయటవికిరాళ్లపై వాల్చి గాఢనిద్రాపరులైరి. నిద్ర సుఖంబును గమనింపదని వచింతు రిట్టిదే కావలయును. (దూరమున నొక పురుగును

జూచి) ఈపురు విచ్చటి కెక్కడినుండి వచ్చినది. గురుదేవునకు నిద్రాభంగము గల్గించునేమో దూరముగా విసరివేయుదునా?

(అట్లాచరించును.)

(పురువు రెండవమారు కర్ణుని తొడ క్రిందిభాగము కఱచి పట్టుకొనును.)

కర్ణ—ఇదేమి? ఈపురుగు శనివలె వదలునట్లుగా లేదు. (తీయుటకు యత్నింప పురువు తొడలోనికి దూరిపోవును.)

కర్ణ—ఆశ్చర్యముగా నున్నదే! మెల్లన తొడ క్రిందిభాగమునఁ జేరి మిగుల వేదన గలిగించుచున్నదే! (పరికించి) అయ్యో! రక్తముగూడ వచ్చుచున్నది. ఏమి సేయుదును? అబ్బా! అంతకంతకు బాధ మిక్కుటమగుచున్నట్లు కాన్పించుచున్నదే. గురువుగారిని ప్రబోధింతునా?

గీ. ఎన్నడోగాని నిదురించి ◆ ఎఱుఁగ కిట్టె
కన్నుగవమూసి నిదురింప ◆ గడగె నిపుఁడె
నుంత నిదురించెనో లేదో ◆ యంతలోన
నెట్లు మేల్కొల్ప నేర్తు నిం ◆ కేమి సేతు.

(క్రిందకుజూచి) ఆహా! ఏమీ రక్తప్రవాహము కట్ట తెగిన గంగోదకము వలె ప్రవహించుచున్నదే. గురువుల ప్రబోధించి మేల్కొలుపుదునా? మేల్కొలిపిన గాఢనిద్రాపరవశుడనై యుండ నేల నిద్రాభంగము గావించితివని కోపించిశపించునేమో కదా? మేల్కొలుపకున్న నీరక్త ప్రవాహ మాతనియంగములఁ నంటునేమో గదా! ఏమి చేయుదును.

(రక్తమున దడియుటచే మేల్కాంచి పరశురాముడు దిగ్గున లేచి)

ప—ఏమీ రక్తము?

కర్ణ—మహాత్మా! తమకు నిద్రాభంగమైనదా? ఏదో యొకవిధమగు పురుగు నా యంకమును దొలుచుచున్నది. ఆకారణమున గలిగిన దీ రక్తప్రవాహము.

పర—ఏమీ? ఒకపురు వింతరక్త ప్రవాహమునకు గారణమైనదా ఆశ్చర్యముగా నున్నదే.

కర్ణ—(పురువును వెలికి దీసి) అగును మహాత్మా!

పర—నన్నేల మేల్కొలుప వైతివి. ఈబాధ కెట్లోర్చు కొనగలిగితివి.

కర్ణ—తమకు నిద్రాభంగమగునని వెరచి తమ్ము మేల్కొలుప నైతివి.

పర—ఎంతసాహసమున కొడిగట్టితివి. ఇట్టిసాహసము ఓర్పు బ్రాహ్మణులయం దుండుట కల్ల. నీ వెవ్వడవో యెరుల్పుము. (కోపముతో జూచుచుండును)

కర్ణ—నిరుత్తరుఁడై యూరకుండును.

పర—మూర్ఖా! ఇంకనైనను నిక్కము వక్కాణించెదవా? లేదా! నా శాపాగ్నికి గురియయ్యెదవు సుమా!

కర్ణ—(స్వగతమున) వ్యర్థుడనైతివి, కల తెఱంగెఱింగించిన నీతఁడు ప్రళయకాలరుద్రునివలె మండిపడును.

పర—(దివ్యదృష్టిని దిలకించి) దుర్మార్గుడా! దివ్యదృష్టి నీచరిత్రమంతయును తేటతెల్లముగా గనుఁగొంటిని. సూతసూనుడవై నాతో విప్రుండనని బొంకి దివ్యాస్త్రముల బడసితివా? మోసమున విద్యాధనము గడింప నెంచితివా?

కర్ణ—గురువర్యా! క్షమింపవలయును.

పర—ఓరీ మూర్ఖా! నిను క్షమింపవలయునా?

గీ. విప్రవర్యులకే గాని • విద్య గరుప
నని ప్రతిన దాల్పనద్దాని • వ్యర్థపరచి

మోస మొనరించి విద్యను ♦ బొందినట్టి
నిన్ను మన్నింప వలయు నే ♦ నీచహృదయ.

నీయట్టి మోసగాండ్రఁ నూరక విడచుట శ్రేయస్కరము
గాదు ఇర్వదియొక్కమారు పరశుధారల ధారుణీశ్వరుల నన్వే
షించి జక్కాడి పితృదేవతలకు దర్పణము గావించి పరిశుద్ధా
త్ముండనై తప మాచరించుచున్న నన్ను నీ యపవిత్ర రక్త
ముచే దడిపి కలుషితుని గావించితివి గదా?

కర్ణ — (పరశురాముని పాదములపై వ్రాలి) క్షంతవ్యుడను.

పర — పో మ్మావలకు. ఉచ్ఛ నీచతల బోనాడి నా ప్రతినను గంగగల్పి
నను మోసగించిన నరరూప చండాలుఁడవగు నిను మత్క్రో
ధానలంబున భస్మము జేసినగాని హృదయమున కూరటలభింపదు.
ఇంక నాయెదుట నిలువకుము. దుర్మతీ! మోసమున నాకడ
విద్యనేర్చితివి గావున పని పడినప్పుడు నా యొసంగిన యస్త్ర
శస్త్రములు నిర్వీర్యములై నీకు దోడ్పడకుండుగాక - పో మ్మావ
లకు. ఇంక నీముఖంబును గనుబరపకుము.

(నిష్క్రమించును)

కర్ణ — హతవిధీ! పడిన ప్రయాస మంతయుఁను వ్యర్థమైనది.

ఉ. భండనసీమ నర్జునుని ♦ భంగముసేయ దలంచి యిట్టులీ
కొండకు నేగుదెంచితిని ♦ కోరినవిద్య లభించెగాని యీ
చండతరాస్త్ర సంచయము ♦ శాత్రవు నొంపగ సంగరంబునం
దుండినవేళ వ్యర్థమగు ♦ చుండ గురుండు శపించె నక్కటా.

కానిమ్ము గతజల సేతుబంధన మొనరించుచు నిచ్చట గూరు
చుండు టెందులకు హస్తినాపురంబున కరిగెదగాక.

(నిష్క్రమించును)

[ప్రవేశము:—మహేంద్రుఁడు.]

మహేం—అన్నన్నా! ఎంతపని జరిగినది యీ జామదగ్న్యుఁడు కర్ణుని శాపానలంబున భస్మీకృతునిఁ గావించునని కొండంత యాసపడి తిని ఆతఁడు బ్రాహ్మణుఁడు గాడని యెఱింగియు, ఆతఁడు మోసమున విద్యగడించెనని గుర్తించియు దగినశాప మీయఁ డయ్యెను. అయినను గుడ్డిలో మెల్ల యనునట్లు యిదియు కొంత మేలు. సమయమునకు నా యుపదేశించిన యస్త్ర శస్త్రము లుపయోగింపవని శపించెను. అక్కారణమున నీతఁడు సులభముగా నిర్జితుఁడగును. ఇంక నేనేగెదగాక.

(నిష్క్రమించును)

---

## తృతీయరంగము.

హాస్తినాపురప్రాంతమునందలి బయలు.

[చేతిలో నేతిగిన్నెను పట్టుకొని చండికయను నొకస్త్రీ ప్రవేశించును]

చండి—(విసుగుదలతో నొకచో చతికిలబడి) కొంచెంసేపు హాయిగా కూర్చోకుండా యింటికెడితే మాయముండాఅత్తగారు రాకాశి వలె మీదబడి పొడుచుకు తింటుంది. ఈ దిక్కుమాలిన శని యెప్పుడు విరగడౌనో యేమిటో తెలియకున్నది. వయసు మీద బడినకొలదియు దీని గయ్యాళితన మెక్కువై పోతోంది. కాస్సేపు వీధిలో నిలబడితే దీని తల్లికడుపుకాలా వెనక్కాతలే పరుగెత్తు కొనివచ్చి రాకాశిలా మీదబడుతుంది ఈముండను జడిసి కొంతో వరకు ఊరుకొంటున్నానుగాని లేకపోతేనా తెల్లారకుండా సింగారించుకొని తల దువ్వుకొని రంభలా తయారై నాలుగు వీధు

ల్లోనూ హాయిగా కులాసాగా కనబడ్డ వాళ్ళందరితోనూ కబుర్లు చెప్పుకుంటూ విహరించకుందునా? కంటికింపైన కాంతునితో హాయిగా కాలక్షేపము చేయకున్న నావంటిదానికి సంతృప్తి గలుగునా? కన్నులున్నందులకు లోకములోని సుందరులను గాంచి యానందింపని జన్మమెందులకు, ఏమైనను సరే నేను రెండురూములు దాటకుండ నింటిమొగము చూడను, పాపము, నేయి పట్టుకొని వచ్చెద ననియు, కడుపునిండ మ్రింగవచ్చుననియు గంపెడాకలితో గంగారమ్మవలె కాచుకొని యుండును. అవసరమున్న నేను వెళ్ళేవరకు చచ్చినట్లు నోరు మూసికొని కూర్చుండును లేనా వట్టున్న మేయింత బొక్కి కడుపుమంట చల్లార్చుకొనును. ఈ పట్టణములోనికి రాకరాక నచ్చినందుచే గాబోలును కంటికి కగుపడిన మగవాండ్లెల్లను నవమన్మథుని వలెనే గాన్పించుచుండెను. (ముందునకు జూచి) ఆహా! ఎవ్వడీతడు రూపజితమన్మథునివలె నున్నాడు ఇతని తేజము దుర్నిరీక్షమై యున్నది. శరీరకాంతులు కారుచీకటులను దిశాంతములకు బారదోలుచున్నట్లున్నది. ఆహా! ఈతని వెడద యురమున నించుకంత విశ్రమింప జాలని యువతీమణి జన్మము జన్మమే! ఆజానుబాహుండగు నీతని కౌగిట పరవశత్వంబు నొంది బ్రహ్మానందమనుభవించు తరుణీమణిదే జన్మము (ముందునకు జూచి) అదే యాసుందరాంగుడచ్చట నిలచి శస్త్రాభ్యాస మొనరించుచున్నాడు. కన్నుల కఱవు దీరునట్లుగా జూచుచు నీతడిక్కడనెంతసేపును యిచ్చట నే గూర్చుండెదను. (అని కర్ణునివంక దిలకించుచుండును) ఆహా! ఏమీతని నేర్పు. ఎంతలో నెంత సూక్ష్మముగా బాణములతో గొట్టుచున్నాడు. ఇక్కడనుండి చూచుచున్నచో నాతనిముఖము సరిగా గనబడకున్నది. ఆ

ప్రక్కనుండి జూచెదను. (అని కర్ణుని జూచుచు లేచి నడువబో వగా కాలుదగిలి నేతిగిన్నె బోంగిలపడును. అది గ్రమనింపకుండ గనే ముందున కేగును)

(తెరలో) ఏమే చండీ! చండీ! నీ మొగము ముండా! ఇంతసే పెక్కడ చస్తున్నావే.

చండి.—(అదరిపడి వెనుదిరిగి గిన్నితీసికొని) అదిగో అత్తగారుముండ దిగుతోంది. నేతిగిన్ని పట్టుకొని వచ్చు చున్నట్లు నటించెదను.

(తెరలో) చండీ! చండీ! ఎక్కడున్నావే.

చండి.—(విసుగుదలతో) ఇక్కడున్నాను. వస్తూంటే అంత తొందరెం దుకు పాపం యెండలో మీరేవస్తున్నారా?

[ప్రవేశము:—అత్తగారు.]

అత్త.—ఏమే రంఢా! ఇంతసే పేమి చేస్తున్నావు. చీకటింట్లో లేచి నేతి కని పోయినావు మధ్యాహ్నమయ్యేదాకా కొంపకు చేరక దోవలో ఎవళ్లతో సరసా లఘోరిస్తున్నావు.

చం.—అదేమిటండీ. నిండు పునిస్త్రీని పట్టుకొని రంఢా రంఢా యని దీవి స్తారు మీ దీవెనలే ఫలించాలి గదా? నేతికోసం పంపేరుగదా! కాళ్ళు పడిపోయేటట్లు ఎక్కేగుమ్మం దిగేగుమ్మనూ తిరుగలేక చచ్చేను. చేసేవాళ్లకు గాని పన్లోవున్న కష్టసుఖాలు కనబడవు.

అత్త.—ఇంతకు నేయి దొరికినదా లేదా?

చం.—చెపుతూంటేనే! ఎవళ్లనడిగినా నిలవ నెయ్యి పోస్తామన్నారు. కాని కాస్త కాచిపొయ్యమంటే లేదన్నారు మంచినెయ్యి లేక పోతే మీకు సహించదని మారుమూలెక్కడో వున్న గొల్లచిం దంటికి వెళ్లి నెయ్యి పోస్తావా యంటే కూచుంటే కాచి పోస్తా నన్నారు.

అత్త — అయితే అప్పుడు కాచిన్నెయ్యి తెస్తున్నావా? గొలతలో దగా పల్లేదుగదా! మాయదారిముండలు ఎలాకొలుస్తారో యింటి కొచ్చి చూసుకొంటే సోల కరసోలుడు తరిగిపోతుంది.

చం — కూచుని కూచుని కాగిన్నెయ్యి చల్లారేదాకా వుండి కొలిపించుకుని బయలుదేరేను. నేను చూస్తూంటే దగాచేసిందంటే గుడ్లు పీకెయ్యేను దిగబారా కొలిపించుకు వచ్చేను.

అత్త — ఏదీ! ఏదీ! నూణ్ణెయ్యి. పూస కట్టిందా?

చండి — (గిన్ని చూపకుండ త్రిప్పుచు) అబ్బా! మీ చాదస్తమునకు అంతంలేదు. ఓమూల చెపుతూంటే నే—

అత్త — అదేమే! గిన్ని అలాతిప్పుతావు. చూపెట్టమంటే పంచాంగం చదువుతావేం వెధవపంచాంగం నువ్వూనూ!

చండి — గిన్నిలో యింకా నెయ్యి కూచుందనుకున్నారా యేమిటి? ఇదిగో చూచుకోండి (అని గిన్నెను సరిగా జూపును.)

అత్త — ఓసిదెబ్బా! గిన్నెడు నెయ్యి యేంజేసేవు. నీ వెధవపొగరుబోతు జవాబులు కట్టిపెట్టి నెయ్యి తేకపోతే డబ్బులేనా యిలా పారెయ్యి. లేకపోతే డొక్క చీరేస్తాను.

చం — డబ్బులే దాచుకున్నాననుకున్నారా! నెయ్యిపోసిన గొలచందు వెళ్ళాంచేతిలో పెట్టి చక్కావచ్చేను. ఇంకా నా మాటబద్ధము నుకుంటారేమో రండి బుజు విప్పిస్తాను.

అత్త — రంఢా! అయిన నెయ్యేమిచేసితివి? ఏసరనుకు ఎదాన్ని పోసేవు- కాస్త గిన్నితో నెయ్యి పట్రాలేవేమిటే.

చం — సాటలు తిన్నగారానీండి. నెయ్యి పట్టుకువస్తూంటే కర్ణుడు వచ్చినాండు—

అత్త — ఆ కర్ణుడి ఎదాన్ని బోసేవా యేమిటి-

చెల్లి — ఆ- మరే!

అత్త—ఆసి నీదుర్న్యయం మండిపోనూ! ఈ వెధవకు సరసాల కా కర్ణుఁడు దొరికేడఁట-

చం—గాదత్తా! వస్తూంటే కర్ణుఁడువచ్చేడు. కొంచంతగిలేదు- క్రింద బడ్డాను. నెయ్యంతా మట్టిపాలైంది. కంకర్రాళ్ళు గుచ్చుకొని ఒళ్లంతా తేళ్ళుగుట్టినట్లు అయిపోయింది. (తెరలో) రాళ్ళు గాదుగాని మన్మథుడి బాణాలు గుండెలో నాటిపోయేయి- చేతి కందకపోయేడుగదా అని- తేళ్ళు గుట్టినట్లే కాదు అబ్బాపాములు కుట్టినట్లే బాదపడుతోంది.

అత్త—మగాడు మీదకొస్తూంటే కాస్త తప్పుకోకూడదనుకున్నావటే దుర్మార్గురాలా! ఇంతకీ; ఆకర్ణుఁడు మాత్రం ఏంపెద్దమనిషి దార్లో ఆడాళ్ళున్నారు గదా అని కాస్త తప్పుకు వెళ్లకూడదూ నాకంటికెక్కనపడితేనా సాగదీసి నించోబెట్టి అడగనూ! ఆకర్ణుఁడైతేమాత్రం నాకేంలెఖ్ఖ.

చం—అత్తా బాగుండదూరకో! ఇలాగే వస్తున్నారాయన.

అత్త—రానీ నాకేంభయమా! తన కంగరాజ్యం వుందికదా అని మా వంటివాళ్లని యేడిపిస్తే వూరుకుంటామా.

[ప్రవేశము:—కర్ణుఁడు, ఒక సేవకుఁడు.]

కర్ణు—అవ్వా! ఏమనుచుంటివి. నేనంగరాజ్య మున్నదని మిమ్ముల బాధపెట్టుచున్నానా! నిష్కారణంగా మిమ్ము బాధపెట్టుటకు నేనంత యవివేకినా?

అత్త—ఏమో నువ్వెలాంటివాడవో! దార్లోవున్న ఆడాళ్లని చూడకుండా రానుకుపోవాలా నాయనా?

సేవ—అవ్వా! మే మీవైపునకేరాలేదు. అట్టియెడ నాడవాళ్ళపై బడి నామని నిందింతువేమవ్వా.

అత్త—ఆలాగునా! నాయనా! ఏమే చండీ! నీమొగము మండా నాతో ఎందు కలా చెప్పేవు.

చం—వారు నాపై బడినారని నేను చెప్పినానా? వారిని చూస్తూ యుంటే నేనే పడ్డాను. నెయ్యి వొలికింది.

కర్ణ—ఇంతమాత్రమున కేనా నన్ను దూషింప మొదలుపెట్టినది. నేయి మూల్యమిచ్చెదను గొనిపొమ్ము.

అత్త—నాయనా! వృద్ధురాలిని. ఇప్పుడు నెయ్యికోసం మళ్ళీ వెళ్లగలనా నాయినా! డబ్బెవరికి కావాలి.

కర్ణ—అయిన నేయి వొలికినచోటికి రండు. నేతినే యొసంగెదను.

(అందరును నిష్క్రమింతురు.)

(తెరలో) ఓరీ దుర్మతీ! అంగరాజా! ఒడలి మదమున కన్ను మిన్ను గానకుంటివి. నన్ను పీడించి నేయిని గైకొంటివి గావున నాశాప మనుభవింపుము.

ఇది ద్వితీయాంకము.

# దానవీరకర్ణ

## తృతీయాంకము.

సౌధమునందలి యొక మహలు

[ప్రవేశము:—కృష్ణార్జునులు.]

కృష్ణ—అర్జునా! నీవు పొరబడుచుంటివి. కర్ణుఁ డంగదేశమునకే గాదు చతుస్సముద్రముద్రితధరావలయంబును పరిపాలింపదగిన చక్రవర్తిలక్షణలక్షితుఁడు.

చ. ఇతఁడొక యంగదేశమున • కే పరిపాలకుఁడౌట వింతగా
దితఁడు చతుస్సముద్రములు • యెల్లలుగాగల భూమి నంత యా...
చతురత నేలగాగలడు • సజ్జన సత్తముఁడౌను; యీావిచే
నితఁడు యశంబుగాంచు ధర • ణీవలయంబున నంచు నమ్ము మా.

అర్జు—ఈవిచే ధరణీవలయంబున యశంబుగాంచునా?

కృష్ణ—అవును, ఈతఁడు దానకర్ణుఁడని విఖ్యాతినొందును. ఈతని కర న్విముక్త దానోదకము నిర్ఝరావగాప్రవాహంబులైనడి ప్రవహిం చుననటులో నతిశయోక్తి యుండబోదు గ్రహతారకు లె ... తలంబున నుండునంతకాల మీతఁడు సాటిలేని యశం... బున వెలుంగుచుండును.

అర్జు—ఏమో! నాకీవిషయమున సందియము జనించుచున్నది.

కృష్ణ—నీసందేహమును బాపెదను రమ్ము. రహస్యముగా మనవేగ

యాతని వితరణమెట్టిదో కనుగొందము. ఇందువలన గలుగబోవు నష్టమేమున్నది?

అర్జు—మంచిది. కాని మనమేగినచో నాతఁడు గుర్తించునేమో?

కృష్ణు—బ్రాహ్మణవేషముల ధరించి పోవుదము. అచ్చట జరుగనున్న విచిత్రముల గాంచినంతనే నీవు నిశ్చయముగా విభ్రమాశ్చర్యములకు లోనగుదువు.

(ఇరువురును పరిక్రమింతురు.)

---

తెం యెత్తబడును.

కర్ణుని దర్బారు.

[కర్ణుఁడు సింహాసనాసీనుఁడై యుండును. మంత్రి మున్నగువారు యథోచితాసనములపైఁ గూర్చుండియుందురు. నలువురైదుగురు విప్రులు యొకింతదూరమున గూర్చుండియుందురు. ఆ సమయమున కృష్ణార్జునులు బ్రాహ్మణవేషములతో ప్రవేశింతురు.]

మంత్రి—దేవా! అర్థులై యరుదెంచిన విప్రసత్తములు దేవర సందర్శనార్థమరుదెంచి నిరీక్షించుచున్నారు.

కర్ణు—గీ అర్థియనుపేరు చెవిసోకి • నంతలోన
చిత్తమానందసరసిలో • జెలగి యాను
యర్థి కోర్కెను దీర్చిన • యపుడు నాకు
నింత యనరాని మోదము లభించుచుండు.

అర్థులై యరుదెంచినవారి నెన్నడును నా సమ్ముఖమునకు దోడ్కొనిరాకుండ నిలుపవలదు. ఒక్కొక్క రేమి వాంఛించుచుండిరో దెలుపుమనుము.

---

మంత్రి—ఓ విప్రసత్తములారా! మీర లొక్కరొక్కరుగ మీ వాంఛి తములనెఱుంగజేయుఁడు ఈమహారాజును దర్శించినవా రెన్నఁడును రిక్తహస్తములతోఁ బోయియుండలేదు. సంకోచింపకుఁడు

1 బ్రా—(లేచి నిలువబడి) అంగరాజేంద్రులకు శుభమగునుగాక! నేను పౌండరీకమను నొక మహాయజ్ఞమును గావింప నిశ్చయించుకొని యపారమగు ద్రవ్యమును గూడబెట్టితిని—కాని యదే మిపాపమోగాని యాజ్యము లభించుటయే యరుదయ్యెను.

కర్ణ—మంత్రిపుంగవా? పాటలీపురంబునుండి నిన్నటిదినంబున నరుదెంచిన నిరువదివేల యాజ్యభాండములను వీరి గృహంబునకు బంపించుము. మహాత్మా! యాగారంభము గావింపుము. నేటు రేపట మఱియొక యిరువదివేల భాండముల నేతిని బంపించెదను.

1 బ్రాహ్మ—అనుగ్రహింపబడితిని. (ఇతరులతో) నితఁడు కర్ణుఁడు గాఁడు దానకర్ణుఁడు. మున్నెపుడో శిబి నెమ్మెని కండలు గోసి యిచ్చెనని విందుము గాని జూచియుండలేదు. దానకర్ణుఁ డాతని గూడ మించినవాడనుటకు సందేహము లేదు.

కృష్ణ—(రహస్యముగా నర్జునునితో) చూచితివా! అతఁ డెంతటియుదారుఁడో! అడిగెనో లేదో యిరువదివేల నేతికుండల నొసంగి యింకను బంపెదననుచున్నాడు. అంగుల కా విప్రుఁ డెంతగా సంతసించియున్నాఁడో దలకించియుంటివా?

అర్జు—(రహస్యముగ కృష్ణునితో) ఇంకను పరిశీలింపవలయును.

2 బ్రాహ్మ—దానకర్ణమహారాజునకు స్వస్తియగుగాక! మహారాజా! వేదాధ్యయన సంపన్నుఁడను బీదవాఁడను. ఇంతవఱకు సప్తతీతిగ్రహీతవ నసపించుకొనుచుంటిని. కాని నేఁడు పశిబిడ్డల వాలకై పడరానిపాట్లు పడుచుంటిని.

కర్ణు—అమాత్యశేఖరా! దక్షిణదేశమునుండి మనకు బంపబడిన ధేనువులలో నత్యుత్తమమైనవాటిని నాలుగింటిని వీరికొసంగుము—మరఁతిని. వాటిని పోషించుటకు రెండువేల సువర్ణముద్రికల గూడ నొసంగుము.

2 బ్రా—(సంతోషముతో) ఆహా! ఏమి నాభాగ్యము. నిజముగా నీతఁడు దానకర్ణుఁడే.

చ. బుడుతఁడు పాలకై మిగుల ♦ పోరడుచుండగ నేర్చినైన నే
నడుగు టెఱుంగలేక యనఁ♦యంబు విచారము సేతుగాని యీ
పుడమి వరుండు కల్పకము ♦ పోలిక నర్థులకెల్లవేళలం
దడుగక యిచ్చు నంచెఱుగ ♦ నైతిని సత్యము నేఁడు గాంచితిన్.

ఈతని దానధారాప్రవాహము నిర్జరాపగాప్రవాహముభాతి కలకాలమిట్లే ప్రవహించుచుండును గాక.

3 బ్రా—ఓయీ! కల్పకమడిగిన నొసంగును. ఈతఁడో యడగక మున్నె యడుగదలంచిన వాని నత్యంతసంతోషముతో నొసంగుచుండును.

కృష్ణ-(అపవారించి అర్జునునితో) కనుగొంటివా! ఇంకను విమర్శింపుము.

3 బ్రా—నేను వివిధశాస్త్రపారంగతుఁడను. కుటుంబీకుఁడను. హస్తినాపురప్రాంతముల నాశ్రమమేర్పరచుకొని విద్యాదానము సేయుచు కాలము గడుపనెంచితిని.

కర్ణు—హస్తినాపురమున కుత్తరదిశయందు గల ప్రదేశమును దమకొసంగితిని. అచ్చట నొక యాశ్రమమును నిర్మించుకొనుటకై నొకలక్ష సువర్ణముద్రికలనైకొనుఁడు.

కృష్ణు—(అర్జునునితో) జూచితివా! తక్కినవారికి గూడ నీతఁడొసంగువానినిగూడ పరిశీలింపుము. అంతటితో నీకాతనియెడల సద్భావముగలుగును.

4 బ్రాహ్మ—మహారాజునకు స్వస్తియగుగాక! నేను యాగమును సంకల్పించితిని. వర్షములచే నెందును కట్టెలులభించుట లేదు. ఆకారణమున దేవరను సందర్శించుట కరుదెంచితిని.

కర్ణు—మంత్రివరా! ఈతనికి సరిపడునంత వంటచెరకును బంపుము.

5 బ్రా—మహారాజా! వేదాధ్యయనమును ముగించుకొని ద్వితీయాశ్రమ స్వీకారమునకు యత్నించుచుంటిని.

కర్ణు—మహాత్మా! తాము గోరుకొనిన కన్యకామణి యెందున్నదో దెల్పినయెడల సమస్తఖర్చులను మేమే భరించి వివాహము గావింతుము. తదుపరి మీకు సౌఖ్యజీవనము గలుగుటకై యిరువదివేల నిష్కముల నొసంగుచుంటిని.

కృష్ణు—(అర్జునునితో రహస్యముగా) నింక తడయుటమంచిదిగాదు. నాయభిప్రాయమును గూడ వ్యక్తపరచెదను.

కర్ణు—(బ్రాహ్మణవేషముతో నున్న కృష్ణుని జూచి) అయ్యా! తమరేదో యడుగదలంచియు సంకోచించుచున్నట్లగపడుచున్నది. సంకోచింపకుడు తమ వాంఛితార్థమెట్టిదైనను దప్పక దీర్పగలను.

కృష్ణు—అంగరాజాధిప! మేము సత్రయాగమాచరించుచుంటిమి. సర్వమును సమకూర్చుకొనియుంటిని. యాగమారంభించితిమి. కాని వర్షములచే నెందుకట్టెలు దొరుకక బాధపడుచుంటిమి. యాగమునకు విఘ్నముగలుగునేమో యని వెతనొందుచుంటిమి.

కర్ణు—ఓపదివేలబండ్లతో కట్టెలను బంపించెదను.

మంత్రి—దేవా! కట్టెలున్నవి గాని యవి పచ్చిగానుండునేమో!

కృష్ణు—పచ్చిగానుండు వానిని గొనిపోయినందువలన మాకు లాభమేమున్నది

కర్ణు—ఎందుకట్టెలు లేవా? వర్షములచే నున్నవన్నియు దడిసియుండును గాబోలును. అయినను భయములేదు. ఓమహాత్మా! తమరు

వాంఛితమును దీర్చువాడను. (మంత్రితో) ఈసమయమున నెం దుకట్టెలు లభించుటకు వీలున్నదేమో యోచించుము.

మంత్రి—లేదు- లేదు. ఈవర్షముల బాధచే నెవ్వరును యడవికేగుటకు సమ్మతింపరు ఇప్పట్టున వీరికి యింధనముల నొసంగుట కవకాశ ముండదేమో?

కర్ణ—కలదు. ఈచతుశ్శాలయందలి కలప యిరువదివేలబండ్లకు నెక్కిం పవచ్చును దీనిని నాబాణపరంపరచే పడిపోకుండ నిలుపుదును. కలపనంతయు దీసి వీరికొసంగుము.

అర్జు—(తనలో) ఆహా! ఎంతటి వితరణము. నిక్కముగ కీర్తిలేదు దాన కర్ణుడే యగును సందేహములేదు. బాణపరంపరలతో సౌధ మును నిలుపజాలునో లేదో.

కర్ణ—మహాత్మా! కలపను బంపించెదను. అంతవరకు నాగృహమున నాతిథ్యమును గైకొనుచుండుడు.

కృష్ణ—చిత్తము. మమ్ము త్వరలో బంపవలయును. మాకై యచటి వారెల్లరును వేచియుందురు. త్వరలో నేగకున్న యాగమునకు స్వస్తి జెప్పుదురు.

కర్ణ—అట్లేగావింతెదను. ఈచతుశ్శాలను విడచి యవ్వలకేగుడు. నేను కలపనుదీయించి బండ్లపైకెక్కించి మిమ్ము బిలువనంపుదును. మంత్రివరా! పనివాండ్రను బిలిపింపుము.

మంత్రి—చిత్తము.

కర్ణ—మున్ముందు పైభాగమును దీయవలయునుగదా! నేను పైభాగ మున నుండెదను. పనివాండ్ర నచ్చటికే బంపుము.

(అందరును నిష్క్రమింతురు)

తెర వ్రాలును.

## ద్వితీయరంగము.



### విష్కంభము.

హస్తినాపుర మందలి వీథి.

[సంజయుఁడు, ముకుందుఁడు అనియెడు బ్రాహ్మణులు చెరియొక వైపునుండియు ప్రవేశింతురు.]

సంజ—దిక్కుమాలిన సంసారము. సంసారతాపత్రియములో బడిన వారికి లోకముతో నిమిత్తముండదు గదా? శ్రీకృష్ణరాయ భారము సందలి విశేషమేమో కనుగొనవలయు నని యెంత యుబలాటపడియుంటిని. కాని యేమిలాభము ఇల్లు గదలుటకె యవకాశముగలుగలేదు. అదిగో! ముకుందుడు గాఁబోలును వచ్చుచున్నాఁడు. వీనివలన సభావిశేషము లేమైన దెలియు నేమో! అడిగిజూచెదను. ముకుందా! సభ కేగితివా?

ముకుం—నీవా? సంజయా! సభకురాలేదా! నీయట్టి దురదృష్టవంతు డుండబోఁడు సుమీ.

సంజ—ఏమట్లనుచుంటివి. విశేషము లేమి? సంధిప్రయత్నము లెంత వరకు కొనసాగినవి.

ముకుం—ఓహో! ప్రశ్నలవర్షము గురిపించుచున్నావే? ముందుగా నే ప్రశ్నకు జవాబొసంగు మనియెదవు?

సంజ—సభావిశేషము లేమో ముందుగా దెలుపుము.

ముకుం—సభావిశేషముల నుత్కృష్టమైన దాని నెఱింగించెద నాల్కిం పుము. కిరాడ్విగ్రహుండగు కృష్ణభగవానుని నిజరూపమును కన్నుల గఱవుదీరునట్లుగా సందర్శించితిమి.

సంజ—నీవనినట్లుగా నేను దురదృష్టవంతుడనేని కావి రాయభార మేమైనది.

ముకుం—వ్యర్థమైనది.

సంజ—వ్యర్థమైనదా? ఎట్లు.

ముకుం—సుయోధనుని కంఠమున జీవుడుండగా సంధి పొసగదు.

సంజ—అయినయెడల యుద్ధమునకే యిరుపక్షములవారును యంగీక రించిరని తలంపవలయును.

ముకుం—యుద్ధము సిద్ధము. అదియు త్వరలోననే—

సంజ—శ్రీకృష్ణుడైన సుయోధను నంగీకరింప జేయలేకపోయెనా?

ముకుం—(నవ్వును)

సంజ—ఏమట్లు నవ్వెదవు?

ముకుం—సుయోధనుడు శ్రీకృష్ణుని పలుకు లాలించునా? ఆతని బట్టి బంధింపవలయునని విశ్వప్రయత్నము లాచరించినాడు కృతకృత్యుడు గాజాలడయ్యెను.

సంజ—పరాత్పరుండగు భగవానునే బంధింపజూచెనా? అపు డేమైనది.

ముకుం—అపుడు కృష్ణుడు నిజరూపమును మాకెల్లరకును జూపించెను.

సంజ—ధృతరాష్ట్రుడేమి కుమారుని మందలింపడయ్యెనా? కురువృద్ధుడగు భీష్ముడేమనియెను.

ముకుం—ఎల్లరును సుయోధనునకు హితము నుపదేశించిరి. ఆసమయమున నాతడు సభనుండి వెడలిపోయెను.

సంజ—సుయోధనుడు యుద్ధమున కాయత్తపడుచుండెనని యే తలంతును.

ముకుం—పదునొకండక్షౌహిణుల సైన్యమును సమకూర్చెను. యుద్ధ మెప్పు డారంభించునా యని ప్రతీక్షించుచున్నాడు.

సంజ—కాని సుయోధనునకు జయము చేకూరుట సందేహము.

ముకుం—ఏమట్లనుచుంటివి. ఈయపారసైన్యసముద్రము నాపాండవ పంచకము మాత్రము తరింపగలదా?

సంజ—తప్పక పాండవులే జయింతురు.

ముకుం—నీ యపూర్వజోస్యమున కాధారమేమి?

సంజ—లేడా కృష్ణుడు. ఆత డెక్కడనున్న యట జయము తప్పకగ లుగును. కృష్ణుడు పాండవపక్షపాతి కావున నాతడు పాండవు లకే జయమొసంగును.

(తెరలో) ఓరీ దుర్మదాంధా! పాండవులకే జయము గలుగు నని పేలుచుంటివా! ఆగు మాగుము. ఇట్లూరక వదరుచున్న నీ నాలుకను శతసహస్రచీలికల గావించెదను.

ముకుం, సంజయుడు—(భయముతో) ప్రాణములమీదకు స్వయముగా దెచ్చుకొంటిమి. ఇంక నిచ్చటనిలిచిన మేనప్రాణములుండవు.

(ఇరువురును పరుగిడుదురు.)

---

తెర యెత్తబడును.

[కృష్ణుడు తన రథముపై కర్ణుని గూర్చుండబెట్టుకొని ప్రవేశించుచున్నాడు.]

కృష్ణుడు—అంగరాజా! నీతో నొక్క రహస్యవిషయమును దెలుప వలయు నని యిట్లు గొనివచ్చియుంటిని.

కర్ణు—ఏమా రహస్యము.

కృష్ణు—కురుక్షేత్రసంగ్రామము జరుగుట నిక్కమగదా?

గీ. సంగరముసేయ నుభయ పక్షంబులకును
జయము లభియించుననుట యసంగతంబు
గాన యుద్ధంబు నాపగా గలుగుటకును
యత్నముల నెన్నియేని సేయంగవలయు.

కర్ణ—యుద్ధ మనర్థదాయకమనుట నిక్కువమే. అయినను కురుక్షేత్ర సంగ్రామము జరుగకుండ నాపుట కేటి మార్గమ్మును గాన్పింపదు.

కృష్ణ—ఉన్నది. అదంతయు నీచేతిలోనున్నది. నీవు దలంచినచో యుద్ధము జరుగకుండ నాపగలవు.

కర్ణ—నేనా? ఈమహత్కార్యము నా భుజాస్కంధములపైననే యున్నదా? నమ్మజాలను.

కృష్ణ—నీతో నేనెక్కసక్కెము లాడుదునా?

కర్ణ—యదునందనా! నీపల్కులు గూఢములుగానున్నవి. అయిన నీమహాయుద్ధమునకు నేన కారణుడనని నీవు తలంచుచున్నట్లు దోచుచున్నది.

కృష్ణ—కాదు. కాదు. పొరబడుచుంటివి. యుద్ధ మాపుటమాత్రమే నీ చేతులయం దున్నదనుచుంటిని.

కర్ణ—ఎట్లు?

కృష్ణ—శ్రద్ధతో నాలింపుము నీవు పాండవపక్ష మవలంబించితివేని సుయోధనుఁడు సంగ్రామమునుండి విముఖుఁడగును.

కర్ణ—నేను పాండవపక్షు జేరిన యుద్ధ మాగిపోవునని యేతలంపుము కాని యన్నెన్నటికి జరుగదు. కాని నీ వీ వింతవర్తన మెప్పుడు నేర్చుకొంటివి.

గీ. ప్రాణ మొక్కటియును శరీరములు రెండు
గాగ మెలగు మాకెడబాటు గలుగజేసి
కదనమనుమాట లేకుండగా నొనర్చి
ధరణి పాండుపుత్త్రుల కీయ దలఁచినావె.

కృష్ణ—కాదు- కాదు. చతుస్సముద్రముద్రితధరావలయంబునకు నిన్నే పట్టాభిషిక్తుని గావించెదను.

కర్ణ—నీవొసంగెదననుచున్న సంపదల నాశించువాఁడీ కర్ణుఁడు గాడు.

కృష్ణు—కర్ణా స్థిరచిత్తుడవై యాలోచించుకొనుము. నాపల్కులయందలి యథార్థమును గుర్తించుము. నానారాజశిరోమణిగణస్థగిత విపుల పాదపీఠుండగు నాధర్మతనూజుండును—కౌరవాన్వయాధినాధకుమారుండగు సుయోధనుండును యిరుగడల నిలచి నీకు వైదండలొసంగ, సింహబలదమనుండగు భీమసేనుండును, దుశ్శాసనుండును ఛత్రమును బట్ట నకుల సహదేవులు ఛత్రచామరములిడగ నీవెవ్వరితో మత్సరించి యుద్ధమున దలపడనెల్లపుడు సంసిద్ధుడ వగుచుందువో యట్టి పార్థుండు నీచెప్పుచేతల ములంగ త్రిజగన్మోహినియు, పరమసాధ్వియు నగు ద్రౌపది పట్టంపు దేవియై యుండ నతులవైభవంబున నీధరావలయంబును పరిపాలింపగలుగుట సామాన్యసంపదయనుకొంటివా?

కర్ణు—నీమాటలు నాకు రుచించుటలేదు. కౌరవపాండవుల కేనాడును సఖ్యత గుదురదు. వారి వారి హృదంతరాళముల నడగియున్న మనస్పర్థ లింత నంత దీరునవిగావు.

కృష్ణు—రాధాత్మజా! నాపలుకు లాలింపుము.

ఉ. ఆరయజాలకుంటివి పృథాతనయుం డొకరుండె రేపు దు
ర్వారపరాక్రమంబున నవారితుడై మొనజొచ్చి నిన్ను నీ
వారల నొక్కపెట్టునను బాణపరంపరగూల్చువేళ్ల యె
వ్వారును దోడురారు బహుభంగుల గుండెదవంచు నమ్ముమీ.

పార్థుని నొక్కటికయ్యంబున నుక్కడంగలనని గర్వింపకుము. నీవనుకొనిన ట్లాతడు నీచే నిర్జితుడుగాడు. పాశుపతాస్త్రవేది. నిన్ను నీయట్టివారల వెక్కురగూడ నొక్కట జయింపగలడు. వెనుకటి పరిస్థితుల దలంచుకొనుము. గంధర్వుల బారద్రోలు నాడును, గోగ్రహణము నాడును, మీ మీ బలంబు లేమయ్యెనో యించుక యాలోచించుకొనుము. వాయువున కగ్ని దోడ్పడినట్లు—

నే నా కవ్వడికి రక్షకుఁడనై యాతని రథంబున నుండ నాతని జయించుటకు గాదు దేరి జూచుటకు నెవ్వారికైన సాధ్యముగా దని తెలంపుము.

కర్ణు—నాపలుకులను గూడ నించుక యాలింపుము.

చ. ఎఱుఁగుదు ధర్మజాదులు జ♦యించెదరంచును కౌరవాళికిన్
మరణము సిద్ధమైన దను♦మాటనుగూడ నెఱింగియుంటి సం
గరమున నేను నిక్కముగ ♦ గాండివి కోడెదనంచుఁ గూడ ము
న్నెఱుఁగుదు నైన కౌరవుల ♦ నిప్పుడు వీడుట యెట్లు మాధవా!

పగవారలజేరి ప్రాణముల గాపాడుకొనరాదా యని వచింతు వేమో యాలింపుము.

ఉ. కాయ మశాశ్వతంబు కల♦కాలము గూడ నశింపకుండ న
స్తోయముగా జెలంగెడి వి♦శేష యశంబును గంగగల్పి నే
దాయల పంచజేరినను ♦ దప్పక కల్గెడు నట్టిలాభ మే
మో యదువంశచంద్ర మది♦నూహ యొనర్చి వచింపరాదొకో.

ఆవిషయము లట్లుంచుము. నీవు చెప్పిన ట్లొనర్చిన లోకు లెల్లరును హాసింపరా? ఇంక నావిషయమునుగూర్చి వచింపకుము.

చ. ఎఱిఁగి యెఱుంగకో వసుమ♦తీశ్వరు యుప్పు భుజించి నేను య
క్కఱపడువేళ చేయఁదగు ♦ కార్య మొనర్పక నేడు లోకులం
దఱు హసియింప శాత్రవుల ♦ దాపున కేగరుగంగలేను, సం
గరమున నెద్ది యేచవలనఁ ♦ గాఁగలదో యటు లౌను మాధవా!

ఉ. వ్యర్థము నీప్రయత్నము వి♦వాదము సిద్ధము గాని మామన
స్పర్థలు దీరఁబోవు శర♦చాపములన్ ధరియించి నిల్వ న
ప్పార్థుఁడె కాఁడు పార్థివుఁడు ♦ వచ్చినఁ బోరెద ధార్తరాష్ట్రుకై
యర్థము ప్రాణముల్ దృణము♦భంగి త్యజించెద కృష్ణ! నమ్ముమీ.

ఇందులకేనా నన్నింతదూరము గొనివచ్చితివి? ఇంక నాకు సెల విమ్మా. పోయి వచ్చెదను.

కృష్ణు—ఆగు మాగుము, నీ కొక పరమరహస్య మెఱింగించెద నా లింపుము.

చ. పరుఁడవు గావు, సన్నిహితబంధుఁడ వౌదువు, దాచనేల? సో
దరుఁడవు ధర్మరాజునకు; ధర్మజుకంటెను మున్ను కుంతి భా
స్కరునివరంబుచేఁ బడయఁ గల్గెను నిన్ను; సమస్తధారుణీ
భరణధురీణుఁ జేసెదను పాండుతనూజులఁ జేర నెంచుమా.

కర్ణు—కృష్ణా! ఆవిషయ మీవటకే నే నెఱుంగుదును. అయిన నొక్క విషయము నీకుఁ దెలుపుచున్నాను. లోక మంతయును నన్ను రాధేయుఁడనియే యెఱుంగును గాని కుంతీపుత్రుఁడనని యెఱుంగరు. ఇపుడు పాండవులఁ జేర నరిగితినేని లోకు లందఱును న న్నొక్కపెట్టున నపహసింపకుందురా?

గీ. క్రీడిశరజాలములకు నే నోడుదు నని
వెఱచి పాండుపుత్రులఁ జేర నరిగినాఁడు
సహజముగ సూతపుత్రుం డౌ శౌర్యహీనుఁ
డనుచుఁ దిట్టరే లోకు లీ యవనియందు.

సుయోధనుండు తనసేనాసముదయమున నర్జును బాణవర్షంబుల నాఁపఁగల మేటిశూరుఁడ నని నమ్మి బాల్యమునుండియు నాద రించియున్నాఁడు. అట్టివానియెడఁ గృతఘ్నుఁడనై ప్రవర్తింపఁ జాలను. ఇంక నావిషయమును గూర్చి ప్రస్తావింపకు మని ప్రా ర్థించుచుంటిని.

కృష్ణు—ఆలోచించియే నీ విట్టిప్రత్యుత్తర మొసఁగియుంటి వని తలం పను. నీకు గలుగనున్న మహదైశ్వర్యమును నిష్కారణ మేల కాలఁ ద్రన్నెదవు?

కర్ణు— తుచ్ఛమగు నైశ్వర్యమున కాసించి స్థిరంబగు యశంబును వమ్ముగనర్చుకొనజాలను క్షమింపుము. సర్వము నెఱింగిన నీవు- సర్వవిదుండవగు నీవు నన్నిట్లాడుట నాయదృష్టమనుకొందును.

కృష్ణు— కర్ణా! అట్లనకుము నావిధ్యుక్తమును నేను నిర్వహించుచుంటిని.

కర్ణు— కాని నిన్నొక్క టర్థించుచున్నాను.

కృష్ణు— ఏమది?

కర్ణు— నీవు నాజననవృత్తాంతమును ధర్మరాజునకు మాత్రము దెలియ నీయకుము.

కృష్ణు— ఏల ?

కర్ణు— అతఁడు సమస్తసద్గుణధురీణుడు. అట్టివాడు యీవసుమతీశుడైనచో భరతఖండమంతయును సౌఖ్యమొందగలదు. నీవాతని కీ రహస్యమును వెల్లడించినచో నింక యుద్ధముసేయడు.

కృష్ణు— మంచి దట్లే యొనర్చెదను.

కర్ణు— ధర్మజునకే గాదు. పాండుపుత్రులలో నెవ్వనికినిగూడ నీవృత్తాంతమును దెలియనీయకుము.

కృష్ణు— నీయిష్టము. కాని నాపలుకుల నించుక సవిమర్శకముగా నాలోచింపవైతివని మాత్రము చింతించుచున్నాను. ఇంకను మించినది లేదు.

కర్ణు— ఇంక నావిషయమును ప్రస్తావించి నామనస్సునకు నొప్పి గల్గింపకుము.

కృష్ణు— కానిమ్ము. కుంతీదేవియు నీవిషయమై మాటలాడుటకు నీచెంతకు రానున్నది. ఇంక నేనేగెదను. ఎట్లొనరించుట యుక్తమో యట్లే కావింపుము.

కర్ణు— మంచి దట్లనే గావింతును.

కృష్ణు— నే బోయి వచ్చెదను. (కృష్ణుడు నిష్క్రమించును.)

కర్ణు—నన్ను నెపబెట్టుటకు గాక యిప్పు డీ రహస్యమును నాకేల దెలుపవలయును. ఈకురుక్షేత్రసంగ్రామమున కీతఁడే సూత్రధారుఁడనుట నిక్కువము. కానిమ్ము జరుగనున్నదానిని గూర్చి వితర్కింపనేల ?

(నిష్క్రమించును.)

తెర పడును.

---

## ద్వితీయ రంగము.

కర్ణుని మందిరము.

[కర్ణుఁ డొక యాసనముపై గూర్చుండియుండగా తెర లేచును. కుంతీదేవి ప్రవేశించును.]

కుంతి—నాయనా ! కర్ణా! ఎందుంటివి?

కర్ణు—తల్లీ ! అంగరాజగు రాధేయుఁడిదే నమస్కరించుచున్నాఁడు.

కుంతి—నాయనా ! నీవెక్కడి రాధేయుఁడవు ? నీయట్టి శూరశిఖామణిచే "నమ్మా" యని పిలిపించుకొనునంతటి మహాద్భాగ్యమునకు నోచుకొనజాలక పరితాపభారమున నింతవరకు కృశించుచున్నదాన నగు నన్నింకను- యేల నొప్పించెదవు.

కర్ణు—తల్లీ ! అదే మిట్లాడెదవు ?

కుంతి—కుమారా ! ఆహా ! ఎన్నిదినంబులకు నిన్ను కుమారా యని సంబోధింపగల్గితిని. ఇన్నిదినంబులదనుక నాహృదంతరాళమున దాచుకొనియుంచిన రహస్యవృత్తాంత మొక్కటి దెల్పెద నాలింపుము. దూర్వాసమహామునిని నాకనుగ్రహించిన మంత్రప్రభావ మెట్టిదో నరయుగోరి యొక్కనాడు ఋతుస్నాతనై భాస్కరుని

ప్రార్థింప నాతఁడు కరుణాంతరంగుఁడై సాక్షాత్కరించెను. అపుడు సద్యోగర్భమున నాతని యనుగ్రహమునె నిను బుత్రునిగాఁ బడయగల్గితిని. కాని—(విచారించును.)

కర్ణు—తల్లీ! యటుపిమ్మటి వృత్తాంతమును గూడ వినిపింపుము.

కుంతి—నాయనా! అపుడు నేను కన్యనై యుండుటచే సంఘబహిష్కారమున కోడి నిన్నొక పెట్టెయందుంచి ప్రవాహమున విడువలేక విడువలేక విడచితిని. సూతుఁడు నిన్ను గైకొని దనభార్యకు నిన్నొసంగు టెఱింగిన యపు డెంతగా సంతసించితినో యాపరమాత్మునకే దెలియవలయును.

కర్ణు—తల్లీ! ఇపు డావిషయముల స్మరించుకొనినందువలన గలుగు ప్రయోజన మేమున్నది.

కుంతి—నాయనా! ఈరహస్య మిక నాహృదంతరాళమున నుండునట్లు దోపకున్నది.

కర్ణు—తల్లీ! నన్నేమిచేయుమందువు. ఈవృత్తాంతమును నాకిపుఁ డేల యెఱింగించితివి. నాహృదయమును గూడ నిష్కారణముగా వ్యాకుల మొందఁ జేసితివిగదా?

కుంతి—ఏమిచేయుదు నని ప్రశ్నించుచుంటివా? నాపలుకు లాలింపుము. నీవును నాకుమారుఁడవగుటచే పాండవులతో బద్ధసఖ్యుఁడవై మెలంగుము. కన్నులవింపుగా దిలకించి యానందింతును.

కర్ణు—తల్లీ! ఏకార్య మొనర్పరాదో—ఏకార్య మొనర్చుట నీచాధములుగూడ సంకోచింతురో యట్టి యకార్య మాచరింపుమని ప్రోత్సహించుచుంటివా?

కుంతి— ఇం దకార్య మేమున్నది?

కర్ణు—అకార్యమే లేదా! ఎవ్వని యాదరాభిమానములచే నీశరీరము పోషింపబడినదో యాప్రభుసత్తమునకు యక్కఱగలవేళయందు

దోడ్పడకుండుట కార్యముగాదా! తల్లీ- నీవు కుమారుల కిట్లే బోధింతువా?

కుంతి—నాయనా! నీకును సుయోధనునకును గల మైత్రిని బురస్కరించుకొని యే యిట్లంటిని.

కర్ణ—అదెట్లు?

కుంతి—నాయనా! సుయోధనుఁడు ధర్మజునకు రాజ్యమొసఁగుట కంగీకరింపడు గాని దన యాప్తసఖుఁడవైన నీకు రాజ్యమొసంగుటకు సంకోచింపడు.

కర్ణ—అయిన—

కుంతి—నాయనా! నాకు గర్భశోకము లేకుండబోవును. నాకుమారు లెల్లరును సుఖులై హస్తినాపురాధీశ్వరులై యుందురు. అప్పటి నాయానంద మింతని వచింప నలవియగునా?

కర్ణ—తల్లీ! యిదెట్టి కోర్కె.

కుంతి—నాయనా! స్త్రీసహజమిదియగనే! ఏవనితామణి తన సంతతి యంతయు సజీవులై యుండవలయుననియు, తన సంతతి వారధిక భోగంబుల ననుభవించుచు నుండవలెనని యపేక్షింపదు. ఆట్లే గావింపుమని నేనును నిన్ను గోరుచున్నాను.

కర్ణ—తల్లీ! ఇందలి పరమార్థమును నీకెఱింగించుచుంటి నాలింపుము. కురుపాండవుల హృదయంబుల నెలకొనియున్న మనస్పర్థ లింత నంతదీరవు. ఎట్లును సంగ్రామము జరుగకమానదు.

కుంతి—కాని నీవు ధర్మజాదులతో గూడియున్న నాకెట్టిచింత యును గలుగదు.

కర్ణ—అదెట్లు—

కుంతి—నీవును కవ్వడియు శరచాపంబుల ధరించి నిలచినయెడల—భీమ సేనుండు యమదండంబును బోలిన గదాదండమును ధరించి

మీకంగరక్షకుఁడై యుండ, ధర్మజుఁడు ప్రోత్సహించుచుండ, కవలు చక్రరక్షకులై నిలువ మిమ్ము దాకుటకు సిద్ధపడువాఁడీలోకమునఁగాదు ముల్లోకంబుల నుండబోఁడు. అపుడు మీవలన నాకు విచారముగలుగుననుమాట కల్ల.

కర్ణ—నీవెన్ని జెప్పినను నేను పాండవుల జేరఁబోను.

ఉ. పుట్టిననాఁడె ప్రేమ నొక ♦ మూలకు ద్రోసి రహస్యవృత్తి నన్
బెట్టెను పెట్టి నీరముల ♦ వీడితి; వప్పుడె చెల్లె ఋణంబు నేటి కి
ప్పట్టున నేగుదెంచి యల ♦ పాండుతనూజుల జేరుమంచు నీ
విట్టు లుపన్యసించు నెడ ♦ యేమని నే వచియింతు నమ్మరో.

కుంతి—అట్లనుట భావ్యమా! నా కుమారుఁడవైన నీవే నాకు పుత్రశోకముగల్గింతువా! ఇది న్యాయమా!

కర్ణ—తల్లీ! పాండవ పంచకమని లోకమునఁ బ్రతీతిగలదు గాన నద్దానికి లోటుగలుగనీయను. నీకు గర్భశోకము గూడ గలుగదు.

కుంతి—అనగా—

కర్ణ—ఏమున్నది? ధర్మజ భీమ నకుల సహదేవులలో నెవ్వానిని వధింపకుందును. కాని ఎవ్వాని దలపడుట కేను సమర్థుండనని సుయోధనుఁడు నమ్మియుండెనో యాపార్థుని మాత్ర మూరక విడువను.

కుంతి—పార్థుని మన్నింపకున్న నాకు గర్భశోకము గలుగదా?

కర్ణ—అప్పటి స్థితిగతులను బట్టి యాలోచింతము.

గీ. పార్థుని జయింప కర్ణుండు ♦ బ్రతికియుండ
పార్థుఁడు జయింప కర్ణుండు ♦ బడయు యశము
ఇరువురునుగూడ భూమిపై ♦ నలమి యుండ
జాలనని నమ్మియుండుమా ♦ స్వాంతమందు.

కుంతి—నాయనా! నాకిది వరప్రసాదమె యగును. నీపల్కులను మాత్ర మేమగక వర్తించుచుండుము.

కర్ణ—తల్లీ ! వచనమిచ్చి దిరుగువాడను గాను.

కుంతి—పోయివచ్చెదను. చిరయశస్సముపార్జితుడవై యాచంద్రతారార్కమీయిలాతలంబున శూరశేఖరుఁడవని యెన్నబడుదువు గాక !

కర్ణ—మంచిది.

కుంతి— (నిష్క్రమించును.)

తెరపడును.

---

## తృతీయరంగము.

కురుక్షేత్రము.

[యుద్ధభూమికి సమీపమున నున్న బయలున సంజయుఁడు, ముకుందుఁడు ప్రవేశించుచున్నారు ]

సంజ—ముకుందా ! నేటికి తొమ్మిదదినములనుండియు సంగ్రామము జరుగుచున్నను నుభయపక్షములందలి వారలలో నొక్కరును నిరుత్సాహులైనట్లు గాన్పింపదు.

ముకుం—నిరుత్సాహులగుదురా ! అందునను సుక్షత్రియులు యుద్ధమనిన వెనుకాడుదురా ! నేఁడాయర్జునుని శరవిద్యానైపుణ్యము సాటిలేనిదై, మహామహులుఁగూడఁ దలలు వంచుకొనఁ జేయుచున్నది.

సంజ—అర్జునుని కోదండపాండిత్యము సామాన్యమని యెవ్వరనఁగలరు. కాని—

ముకుం—కాని యని సంకోచముగా పచించుచుంటి వేమి ?

సంజ—భీష్మప్రతాపాగ్నిముందు నరనారాయణు లిరువురును గూడ

చాలవఱకు నొప్పింపఁబడిరి.

ముకుం—ఆవిషయము తలంచినంత నవ్వువచ్చుచున్నది. చక్రమును బట్టనని శపథము పఠించిన కృష్ణునంతటివాఁడుఁగూడ చక్రమును బట్టి నేల కుఱికినాఁడు.

సంజ—అర్జునుఁడా సమయంబున వారింపకున్న నేమై యుండెడిదో గదా?

ముకుం—ఏమైయుండునో యని సందేహించుచుంటివా? అపుడు భీష్ముఁ డేమికావించెనో తిలకింప లేదా?

సంజ—లేదు అర్జునునివంకకే దృష్టులఁ బరపియుంటిని.

ముకుం—శరచాపములఁ గ్రిందఁ బడవైచి, ముకుళితకరకమలుఁడై కృష్ణా! రమ్ము! రమ్ము!! భవదీయ కరవిముక్తసుదర్శనధారాహతిఁ దెగిన శాశ్వతానందసామ్రాజ్యలక్ష్మిని బడయఁగలవాఁడను రమ్ము! త్వరపడు మని తీవరించెను.

సంజ—ఔను. భీష్ముఁడు శ్రీకృష్ణుని పరమాత్మస్వరూపునిగా నెఱుంగును గాన యట్లు కావించినాఁడు.

ముకుం—నేఁటియుద్ధ మేవిధముగా నుండునో యూహింప నసాధ్యముగా నున్నది.

సంజ—ఏమిరా! భీష్మప్రతాపాగ్ని యింతనంతటఁ జల్లారునా?

ముకుం—చల్లారునని కాదు నాయభిప్రాయము. మాయలకుఁ బుట్టినిల్లగు నా కృష్ణుఁ డిందుల కేదో మాయాజాలమును బన్నియుండును. కానియెడలఁ బాండవులకు జయంబు లభించుననుట కలలోనివార్త కదా!

సంజ—భీష్ములవారు నిన్నటివలె పోరాడిన నొకటి రెండు దినంబులలోఁ బాండవసేనాసముద్ర మంతయు నింకిపోవు ననుట కభ్యంతర ముండునా?

ముకుం—అగును. నిన్నటిదినంబున సంగ్రామమున భీష్మప్రతాపాగ్నికి పదివేలమంది రాకుమారు లింధనమ్ము లైరి కదా!

సంజ—(రహస్యముగ) నిన్నటిరాత్రి పాండునందనులు తాతగారిని సందర్శించుట కరిగియుండి రని తెలియవచ్చినది.

ముకుం—ఎందులకు?

సంజ—అదంతయుఁ గృష్ణుని పన్నాగముగా నుండనోపును.

ముకుం—సందేహ మేమి?

సంజ—కాని యక్కడ జరిగినవృత్తాంత మేమియును తెలియదు.

ముకుం—నేఁటి సంగ్రామముతీరు పరికించిన నంతయు విశదమగును గదా?

సంజ—అవును. రమ్ము- నిన్న కూర్చుండినసలమున నే కూర్చుండము. అచ్చటినుండి యుభయపక్షంబులవారలను గూడఁ జూడఁగలుగుదుము.

ముకుం—మనము త్వరితముగా నేగకున్న నింకొక రాస్థలము నాక్రమించుకొందురు. అపుడే యిరుపక్షంబులవారు సముత్సాహ సన్నాహంబున నల్లదే రణరంగంబున నుఱుకుటకై యుత్సహించుచున్నారు.

సంజ—మనముమాత్ర మిచ్చటఁ గూరుచుండి చేయఁదగిన దేమున్నది- రమ్ము పోవుదము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

తెర పడును.

# దానవీరకర్ణ

## చతుర్థాంకము.

---

యుద్ధభూమి సమీపమునందలి బయలు.

[భీష్ముఁడు శరతల్పగతుఁడై పడియుండును. సమీపమున నిరువురు సేవకు లుపచారములు గావించుచుందురు.]

తెర యెత్తబడును.

భీష్మ—కృష్ణా! యాపద్బాంధవా! సుదర్శనధార వధించియున్న యీవరకె మోక్షసామ్రాజ్యము ననుభవించుచుందును గదా?

[ప్రవేశము:—కర్ణుఁడు.]

కర్ణ—(భీష్ముని సమీపించి) పితామహులగు తమకు రాధేయుఁడు నమస్కారశత మాచరించుచున్నాఁడు.

భీష్మ—నాయనా! వచ్చితివా? రమ్ము. సేవకా యితనికొక యాసనమును గొనితెమ్ము అంగరాజా! కూర్చుండుము.

కర్ణ—(సేవకుఁడు తెచ్చి వైచిన కుర్చీపై భీష్మునకు సమీపమున గూర్చుండును.)

భీష్మ—(సేవకులతో) అంగరాజు నాచెంత నున్నంతరి మీయుపచారములతో నిమిత్తము లేదు. మీరావలనుండుడు. అతఁడేగిన పిమ్మట లోనికి రావచ్చును.

(సేవకులు నిష్క్రమింతురు.)

భీష్ము—అంగరాజా! యుద్ధమునందలి విశేషములేమైనా యోచించితివా? పోనిమ్ము. వలదు వలదు మరణోన్ముఖుడనైన నాకు యుద్ధవిశేషములతో నిమిత్తమేమున్నది? కాని సంగ్రామమతి ఘోరముగా జరుగుచుండగా నీ విట్లేల యరుదెంచితివి?

కర్ణు—(భీష్మునకు మరల నమస్కరించి) పితామహులగు తమయొద్ద యుద్ధమునకు బోవ ననుజ్ఞ గైకొనుట కిటరుదెంచితిని.

భీష్ము—అవునవును. నేటరేపట నీ విట్లు రాగలవనియే తలంచుచుంటిని. నీగుణాగుణంబు లట్టివి. కాని, యుద్ధము చేయబోవుటకు నాయనుజ్ఞతో నిమిత్త మేమున్నది; కాని- ఈయుద్ధపర్యవసాన మేమగునో తెలుపఁగలవా?

కర్ణు—అగతానాగతవేదులగు తమకా నేను చెప్పవలయును? పాండునందనులే జయింతురు.

భీష్ము—సుయోధనుఁడే జయించు ననుకొనుము. అప్పటిపరిస్థితు లెట్లుండునో యించుక యాలోచించి వచింపుము.

కర్ణు—వచింపఁజాలను. తమ రెఱింగించిన విని సంతసించెదను.

భీష్ము—నే నెఱింగించెద నాలింపుము. మున్నెంతటివైభవంబున ధరాపరిపాలన మాచరించియుండెనో యవ్విధంబున పరిపాలన మొనర్పఁజాలఁడు.

చ. గురుఁడు గతింప బంధుజనకోటి నశింపఁగ నాప్తులైన భూ
వరులును యుద్ధభూమిఁ దమప్రాణములున్ త్యజియింప ఘోరసం
గరమునఁ బార్థు డేయు విశిఖంబులు తమ్ములనొంపఁ దాను యొ
క్కరుఁడయి భూమినెల్లఁ గలకాలము నేలెడువాఁడు నమ్ముమా.

ధర్మజుఁడే జయించినను- యుదమువలని నష్టములను బొందకుండ నుండఁజాలఁడు. ఈవిషయ మీరా వంగీకరింతువని తలఁతును.

కర్ణు—యుద్ధమువలన నష్టము గాక లాభ ముండునా?

భీష్మ—సామాన్యనష్టముకూడఁగాదే! ఆప్తజనకోటి నష్టము. ఇట్టి సంగరమును మానినచో నెంతటిలాభ మొనఁగూడునో వచింప సాధ్యమా? ఈవిషయము లన్నియును యాతని కెంతగా బోధించినను వినఁడయ్యెను. కాని యాప్తమిత్రులలో నొక్కరుఁడవైన నీవు స్వయముగ బోధింప నాతఁ డాలించు నేమో! ఇప్పటికైనను మించినది లేదు. ఇరుపక్షములందును ప్రధాను లగువా రెవ్వరును గూలియుండ లేదు. నావిషయమా! నేను కాటికి కాళ్లు చాచుకొనియున్న ముదుకఁడను. నాకై వారు చింతింప వలసిన పనిలేదు. కురుపాండవు లేకమత్యమై, సుఖులై హాస్తినాపురంబును పరిపాలించుచుండిరని విని నిశ్చింతతో—అధికతరంబగు సంతోషముతో మరణింతును.

కర్ణ—పితామహా! సాక్షాత్పరబ్రహ్మమగు శ్రీకృష్ణునంతటి వాఁడె సంధి గావింపలేనపుడు, అల్పుఁడనగు నావలన నయ్యెది నెఱవేఱునా?

భీష్మ—సంగ్రామ మింకను జరుగునా? అబ్బా! యిరుపక్షముల నెవ్వనికి కీడు గల్గినను నయ్యెది నన్నీయంపశయ్యకంటె నెక్కుడుగా బాధించును గదా!

కర్ణ—సంగరమునకుఁ బోవుటకు నా కనుజ్ఞ యొసంగవలయును.

భీష్మ—నాయనా! నీ సేవాధర్మమును చక్కఁగ నిర్వహింపుము. సంగ్రామమున నీ శరచాపంబులఁ బెక్కురవీరుల రోహటించి పోరాడుము. కాని కర్ణా! నాఁ డానిండుసభయందు నిన్నాడిన వాక్యంబులు హృదయంబున నిడుకొనకుము. అటేల పల్కియుంటినో తెలియునా? నీవును పాండునందనుఁడ వగుట యెఱింగి, యుద్ధమును వారించుటకై నాఁడు నీవర్ధరథుఁడ వంటిని. ఆవల్లు

లను పాటింపక సంగ్రామమున నీకోదండపాండిత్యమును జూపి చిరంబగు యశము నార్జింపుము.

కర్ణ—అనుగ్రహింపఁబడితిని.

భీష్మ—ఇంక నీ వేగి పంచారములను బంపుము.

కర్ణ—చిత్తము. (నిష్క్రమించును.)

తెర పడును.

---

## ద్వితీయరంగము.

కురుక్షేత్రము నందలి బయలు.

[ ప్రవేశము:—సంజయుఁడు. ]

సంజ—(దూరమునకు దృష్టి సారించి) ఇపుడే వచ్చెద నని పల్కి నన్నిచ్చట నిల్పి ముకుందుఁ డెందుపోయెనో వాని జాడయైనను గానిపింపకున్నది. నేఁడుఁగూడ యుద్ధమును దిలకించుటకు త్వరితముగా నేగుటకు ప్రాప్తి లేకున్నదిగాఁబోలును! ఇంతలో వీనికేమి రాచకార్యము వచ్చినది. ఇంతలో వత్తు నని చిటికవైచి పోయి గడియసేపైనను రాకుండెను పోనీ వాని కర్మము నే నొక్కఁడనే పోయెదను. (పోవుటకు యత్నించును.)

[ వెనుకనుండి ముకుందుఁడు సంజయుని బిలుచుచు ప్రవేశించును. ]

ముకుం—సంజయా! త్వరపడుచుంటివేమి? యొక్కింత తడవాగుము. ఇంతలో మించిపోవునది లేదు.

సంజ—(వెనుకకుఁ దిరిగి) ఏమయ్యా! యింతాలస్యము? ఇదిగో వచ్చెదనని తుఱ్ఱున పాఱిపోయినావు. గడియసేపటికిఁ గాని రాకుంటివి.

ముకుం — త్వరలో రావలయుననియే పోయియుంటిని. కాని ఆలస్యమైనది

సంజ — ఇంతసే పేమి చేయుచుంటివి?

ముకుం — శకునియు, సుయోధనుఁడును నేదో రహస్యముగా మాటలాడుకొనుచుఁ బోవుచుండుటఁ దిలకించితిమి కదా? వా రేవిషయమునఁగూర్చి మాచ్చటించుకొనుచుండిరో, నేఁటి సంగరముయొక్క పరిస్థితు లెట్లుండునో ముఖ్యముగాఁ దెలిసికొనవలయునని పోయితిని

సంజ — విశేషము లేమైనఁ దెలియవచ్చెనా?

ముకుం — నిన్నటిరోజున నభిమన్యుఁడు కూలినతరువాత యుద్ధ మాపఁబడినది. తదనంతరవృత్తాంతము మన కేమియుఁ దెలియక పోయెను గదా?

సంజ — మరల రాత్రిభాగమున యుద్ధము జరిగినదా?

ముకుం — యుద్ధము జరుగలేదు. అర్జునుఁడు తనకుమారుని మృతి కాసింధురాజు కారణుఁడని యెఱింగి నేఁటి దివసావసానసమయమునకు లోపున నాతనిని జ్రమందించుటకు ప్రతిన దాల్చెనఁట!

సంజ — ఏమని?

ముకుం — అట్లు గావింపఁజాలనినాఁడు గాండీవముతోఁగూడ నగ్నిఁ జొత్తునని ప్రతిన దాల్చెనట.

సంజ — అయ్యయో! దుస్సహమగు ప్రతినయే—

ముకుం — ఏ మట్లందువు?

సంజ — ఈసుయోధనాదులు తక్కువవారా? సైంధవు నెచ్చటనో దాచివైతురు.

ముకుం — సుయోధనుఁ డంత శౌర్యహీనుఁడు గాఁడు.

సంజ — సింధురాజునుగూడ నేఁటి యుద్ధమునకుఁ గొనివత్తురా?

తెర యెత్తఁబడును.

యుద్ధభూమి.

[సర్వసేనాధిపతియగు ద్రోణుఁడు సమయోచిత వేషమునఁ ప్రవేశించును.]

ద్రోణుఁడు—

ఉ. ఓ రణధీరులార! సమరోర్విని మీ బలసాహసంబులన్
ధీరతఁ జూపుఁడీ; వసుమతీశ్వరు నున్నత లంద నొందఁ ధీరుల్
మీఱి విజృంభణంబున నమేయపరాక్రమవిక్రమంబుచే
వైరికి మార్గ మీయక యమోఘబాణపరంపరఁ బారఁద్రోలుఁడీ.

ఈదెస నున్న సైనికు లెల్లరు సముత్సాహులై యెప్పుడెప్పు డాపార్థుని నెదుర్కొందమని వేచియున్నారు. ఇంక నిచ్చటివారిని హెచ్చరింపవలసిన పనిలేదు. కాని నేఁటి ప్రయత్నము లన్నియు విఫలము లగునని యేలకో తోఁచుచున్నది. కవ్వడి యెట్లైనను దనప్రతిజ్ఞ నెఱవేర్చుకొనును. దైవబలసంపన్నులగు నప్పాండవుల కొక్కనాఁటికేని కీడు సంభవింపదు. అమేయబల పరాక్రమసంపన్నులగు నప్పాండవులతో సంధి గావించుకొన్న సుయోధనుండు సుఖియై యెట్టియలజడియు నొందకుండ నుండి యుండును. ఇంతకును విధి విధించినచొప్పునఁ గాకుండునా? ఆతఁ డొక్కరునిగూడ నమ్మి చరించున ట్లగపడదు. దుర్భేద్యమగు నింతటివ్యూహము పన్ని మొగ్గరమున నిల్పి యుద్ధానిని సంరక్షించుచు నే నుండినను- తనకేమో నష్టము కల్గునేమో యని సంకోచించుచున్నట్లె కాన్పించుచున్నాడు. ఈసమయమునం దాతనిచిత్తమున కెట్టివిచారమును గలుగనీయరాదు. మనస్సునం దేమాత్రము విచారము కలిగినను సులభముగా సర్జితుఁడగును.

[ప్రవేశము—సుయోధనుఁడు.]

ద్రో—(తనలో) ఇతఁ డేదో దురుద్దేశమును మనస్సున నిడుకొనియే యిట్లరుదెంచియున్నాఁడు. (ప్రకాశముగా) సుయోధనసార్వభౌమా! నీ వేల యిట్లరుదెంచితివి?

సుయో—గురువర్యా! నా కొక సందేహము తోఁచుచున్నది.

ద్రో—ఏమది?

సుయో—మొగ్గరమున తా ముండుటకంటె, మఱి యెవ్వరైన నుండుట మంచిదేమో?

ద్రో—ఏ మట్లనుకొనుచుంటివి?

సుయో—కర్ణాదులు సైంధవుని సంరక్షింపఁజాలరని తోఁచుచున్నది.

ద్రో—మంచి దట్లనే యరుదెంతును. కాని, యిచ్చట నెవ్వరి నుండ నియమింతువు?

సుయో—కర్ణుఁ డీ మొగ్గరముఖంబున నుండఁగలఁడు.

ద్రో—అట్లే కానింపుము. నీపని చిన్నట్లు చేయుట నాకు విధ్యుక్తము గదా! రమ్ము పోవుదము. (ఇరువురు నిష్క్రమింతురు)

[ప్రవేశము:—కృష్ణార్జునులు]

అర్జు—బావా! ఏమిది? వ్యూహముఖంబున గురునకు బదులుగా నంగరా జగపడుచున్నాఁడు.

కృష్ణ—ఇదంతయును సుయోధనుని పన్నాగము.

అర్జు—అదెట్లు?

కృష్ణ—గురువరేణ్యుఁ డిచ్చట నున్నచో నీయందలి ప్రేమాతిశయంబున మొగ్గరమును జొరనిచ్చునేమో యను భయంబున వ్యూహముఖంబున కర్ణుని యుంచియుండెను.

అర్జు—అది యును మనకు మేలే?

కృష్ణు—అగు నగును.

గీ. శిష్యవాత్సల్య ముండుట • చేత గురుఁడు
తోఁవ యిడె నని గాని, యా•ద్రోణు నట్లొ
ప్రార్థనము సేసి యనిఁజొచ్చె • పార్థుఁడనుచుఁ
గాని పల్కఁగా వీలైనఁ • గానరాదు.

అర్జు—అదియును నిక్కమె! కానిమ్ము మున్ముందీకర్ణుని బిల్లుమార్చి లోని కరుగుదము. అటుపిమ్మట భీమసేనుఁ డెట్లో మార్గమును గావించుకొని త్వరలో మనలఁ గలిసికొనును.

[తెరలో]—సైనికులారా! స్థిరులై నిల్వుఁడు. కపికేతనుండదే మొగ్గరమును సమీపించుచున్నవాఁడు. అప్రమత్తులరై యతి జాగ్రత్తతో నుండుఁడు. వ్యూహముఖంబున నుండి లోనికి రాకుండ నీరాధేయుఁడు వారింపఁగలఁడు. కంఠమున జీవుఁ డుం డుఁడం కొపార్థునకు మార్గ మొసంగవలదు.

కృష్ణు—అల్లదే! సుయోధన సార్వభౌముఁడు సైనికులను హెచ్చరించుచున్నాఁడు.

అర్జు—బావా! ఇంకను జాగేల? కర్ణునే దలపడుదము రమ్ము. ఈత నితో సంగ్రామ మనిన నా కెంతయు సంతసము సుమా!

(ఇరువురును నిష్క్రమింతురు)

---

తెర యెత్తఁబడును.

[సంజయుఁడు, ముకుందుఁడు ప్రవేశింతురు.]

సంజ—ముకుందా! ముకుందా! ఈవంక కనుఁగొంటివా? మత్తమాతంగయూథముపై కుఱుకు పంచాస్యంబుకరణి భీమసేనుఁ డెట్లు ఱుకుచు శత్రుసేనల నలినలి గావించుచున్నాఁడో!

ముకుం—ప్రధానమూర్తులగు కర్ణార్జున ద్వంద్వయుద్ధమును కన్నుల పండువుగాఁ దిలకింతుము. మాటిమాటికిని నన్నుఁ బిలువకుము. కర్ణుఁ డెంతటి శూరశిఖామణి! ఒక్క బాణమున నర్జునుని బాణములనన్నిటిని రూపుమాపుచుండెను.

[తెరలో]

శా. బాలుం డొక్కఁడు రాఁగ పెక్కురొకరై ♦ ప్రాణంబులన్ గొంటి రా
లీలన్ గాక కిరీటి నీయెదుట కేళీలోలతన్ నేఁడు నీ
బాలున్ గూల్పఁగ నేగుదెంచె నిపు డీ ♦ బాణాగ్ని చల్లార్చి ఈ
వేళన్ పుత్త్రుని గాచుకొంటకొఱకై ♦ వేవేగ యత్నింపుమా.

సంజ—అల్లదే యర్జునుఁడు వృషసేనునిపై బాణవర్షమును గురియించుచున్నాఁడు.

ముకుం—వృషసేనుఁడు మాత్రము సామాన్యుఁడనుకొంటివా! పదినారాచముల దాకి తూపులఁ దూలించివైచినాడు.

సంజ—కర్ణుఁ డీసమయమున నూరకొనెనా? లేదు లేదు. కవ్వడిపై నేదో యమోఘాస్త్రమును ప్రయోగించుచున్నాఁడు.

ముకుం—హా! హా! కన్నకుమారుఁడు—కర్ణకుమారుఁడు.

సంజ—పార్థుఁ డనినంతయుఁ జేయక విడచువాఁడు గాఁడు.

ముకుం—వృషసేనుని గూల్చుట—

సంజ—కుమారుని మృతి గాంచి కర్ణుఁ డుగ్రుఁడై కవ్వడిపై వివిధాస్త్రపరంపరను గురియించుచున్నాఁడు.

ముకుం—అర్జునుఁడు వాయువ్యాస్త్రమున వానినన్నిటిని దూలఁగొట్టుచున్నాఁడు.

సంజ—ఆ! ఆ! అదేమి? కర్ణుఁడు మొగ్గరమునుండి యావలి కరుగుచున్నట్లున్నదే!

ముకుం—రమ్మా! రమ్మా! ఇంకను యిక్కడ కూర్చున్న యెడల మనము కూడ సుయోధనుని పక్షమువారమని యార్జునుఁడు మనల వధింపక మానఁడు. వా రీవంక కరుదెంచుచున్నారు.

(ఇరువురును నిష్క్రమింతురు.)

[ప్రవేశము:—కృష్ణార్జునులు.]

అర్జు—అంగరాజా!

చ. పరుగిడె దేల ప్రాణములపై మమకారము తగ్గలేదె? సం
గరమున నేను నిక్కముగఁ గవ్వడి గెల్తు నటంచుఁ దొల్లి భూ
వరునకుఁ జెప్పియుంటి వని పల్కురు వింటిని విక్రమంబుచే
దురమున నన్ను గెల్చికొని దోర్బల మెట్టిదొ చూపరాదొకో?

బావా! యిదేమి? కర్ణుఁడు మొగ్గరమును విడచి లోని కరుగుచున్నాఁడు.

కృష్ణు—అదేమో!

అర్జు—బావా! ఈసమయమున మన భీమసేనాదు లరుదెంచిన వారు గూడ సులభముగా మొగ్గరమునుదాటి లోన ప్రవేశింతురుగదా?

కృష్ణు—(నవ్వును.)

అర్జు—ఏ మట్లు నవ్వెదవు?

కృష్ణు—ఏమా! అంగరాజు నెదుట వృషసేనుని గూల్చుటకు నీవు జాల మొనర్చుచుఁ గూరుచుంటివి. కాని భీమసేనాదులు నీకంటె మున్నుగ మొగ్గరంబును ప్రవేశించి సైన్యముల చెల్లాచెదరు గావించి నీకు మార్గమును చక్కఁజేయుట గమనింపవైతివి గదా యని నవ్వియుంటిని.

అర్జు—అట్లనా? మన మిచ్చట జాల మొనర్చు టెందులకు రమ్మా.

(ఇరువురును నిష్క్రమింతురు.)

తెర పడును.

---

తెర యెత్తబడును.

[ప్రవేశము:—సంజయుఁడు, ముకుందుఁడు.]

సంజ—అల్లదే తిలకింపుము! కృష్ణార్జునులు రణరంగమును ప్రవేశించిరో లేదో కౌరవస్కంధావారమునందుఁ గల సైనికుల శిరంబులు కొబ్బరిబుచ్చెలవలె నేల రాలుచున్నవి.

ముకుం—అర్జును బాణాగ్నికి నేఁడీ సేనాసముదయ మాహుతి యగునేమో!

సంజ—కాదు కాదు. పొరబడుచుంటివి. సుయోధనుఁ డీవంకనుండి యర్జును నెదుర్కొనుటకై త్వరితగతి నరుదెంచుచున్నాఁడు.

ముకుం—కర్ణునంటివాఁడు కాలికి బుద్ధిచెప్పుకొనఁగా నింక నీ సుయోధనుఁడా యాతని నెదిర్చి నిలువఁగలఁడు.

[తెరలో] కలకలము.

సంజ—ఏమా దిక్కున కలకలము వినవచ్చుచున్నది!

ముకుం—(ముందునకుఁ జూచి) ఏమున్నది. భీముని గదాప్రహారముల కూలఁగూలుచున్న తమవారలఁ గనుంగొని గాండీవికిఁ దల నొంచిన కురువీరు లొనర్చిన యార్భాటములు గాఁబోలును.

సంజ—దుర్యోధనుఁ డల్లదే పార్థుని బాణంబులచే శరీరమెల్ల దూట్లు వడ—రోజుచు నాచార్యుల సన్నిధి కెందులకో యరుగుచున్నాఁడు.

ముకుం—కృష్ణార్జును లాతనిఁ జూచి యెవ్విధంబున నవ్వుచుంటిరో తిలకించితివా?

సంజ—అదేమి కృష్ణుఁడు రథమును వెనుకకుఁ ద్రిప్పుచున్నాఁ డేలని?

ముకుం—(దృష్టి ముందునకు సారించి) అవును. వెనుద్రిప్పి యీవంకకే తోలుచున్నాఁడు.

సంజ—ఈ ప్రాంతములకు రారు గదా?

ముకుం—రారని యే తలంతును.

సంజ—వచ్చినను మన కంతగా భయపడవలసిన పనిలేదు.

ముకుం—ఉన్నతప్రదేశమున నున్న మనలను వారు కనుగొనఁజాలరు.

సంజ—కాని వారొనరించునది యెల్ల మనము కనుఁగొనఁగలము.

[ ప్రవేశము:—కృష్ణార్జునులు. ]

పార్థు—బావా! రథమును వెనుద్రిప్పితివేల?

కృష్ణు—అదే గమనించితివా! భాస్కరుఁడు గగనమధ్యంబున కరుదెంచియున్నాఁడు. ఉదయమునుండియు విశ్రాంతిలేకుండగ పనిచేసి యలసియున్న యీగుర్రములు దప్పికచే నాలుకలు వ్రేలవైచియున్నవి. వాని కించుక విశ్రాంతి యొసంగి సేదదీర్చకున్నయెడల కానున్న మహాసంగ్రామమున నెట్లు వర్తింపగలవు.

పార్థు—ఇప్పు డీ సంగ్రామరంగమున వీనికి జలమెక్కడనుండివచ్చును త్వరపడుము

కృష్ణు—నీరము లెక్కడనుండివచ్చునో నీకు నేను జెప్పవలయునా?

గీ. జలపితామహాున కీయ • జలము నెట్లు
లవనికివి దెచ్చియిచ్చితో • యనావిధాన
నలసి నడుపంగనోపని • హయములకును
జలములను దెచ్చి వేగ మొ•సంగవలయు.

అర్జు—నీయభిప్రాయమదా! అట్లనేకానిమ్ము. కాని యీప్రదేశమంత యనుకూలముగా నున్నదని తోపదు. అస్థలంబున నీరములను దెప్పించుటకు ననువుగానున్నది.

కృష్ణు—అట్లేగావింపుము.

అర్జు—[నిష్క్రమించి వెంటనే మరల ప్రవేశించును.]

బావా! అస్థలమున వీరములను చెప్పించియుంటిని. మరియు శత్రువులవలన నెట్టియాలజడియు గలుగకుండుటకై బాణపంజరమును గూడ నిర్మించియుంటిని. గుర్రములను సేదదీర్పుము.

(కృష్ణుడు నిష్క్రమించును.)

[తెరలో నుండి కృష్ణుడు.]

బావా! ఒంటిగానుంటివని కౌరవయోధులెల్లరును ఒక్కటిగా గూడి నీపై నెత్తివచ్చుచున్నారు.

అర్జు—(ముందునకు జూచి) రానిమ్ము. చేతినిండుగ పని గల్పింతురేమో యించుక దిలకించెదను.

సంజ—అదిగో! అందఱొక్కటై యర్జునునిపై నేగుటకు యుత్సహించుచు నరుగుచున్నారు.

ముకుం—అదే యర్జునుడు గాండీవమును పైకెత్తి బాణమును సంధించుచున్నాడు.

సంజ—అదే సామంత్రికముగ బాణమును విడచినాడు.

అర్జు—ఈయస్త్ర మీకౌరవసైన్యమునంతను దవ్వులకు గొనిపోవగలదు.

సంజ—కౌరవసైన్యమంతయును దవ్వులకు గొనిపోబడినది.

ముకుం—అదే కృష్ణుడు గూడ నరుదెంచుచున్నాడు.

[ప్రవేశము:—కృష్ణుడు.]

అర్జు—బావా! గుర్రములు సేదదీరియున్నయెడల రథమాయితము గావింపుము.

కృష్ణ—రథమును సిద్ధముగావించియే యుంటిని రమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

---

యినను రణరంగమున ముందున కేగకుండ గావించుటకై చక్రవర్తియే స్వయముగా పూనుకొని యున్నాఁడు.

[ప్రవేశము:—కృష్ణార్జునులు]

కృష్ణ—బావా! ఇదేమి? సుయోధనుఁ డొకక్రొత్తదేహమును ధరించియున్నాఁడు.

అర్జు—ఇదియొక దుర్భేద్యమగు కవచము. ఆచార్యు నడిగి తెచ్చుకొని యున్నాఁడు.

కృష్ణ—అట్లనా! అటులైన నీతఁ డాకవచమును విప్పివేయుటెట్లో నర్జునా చూచుచుందుము.

దుర్యో—కృష్ణా! ఇంక మిమ్ములను ముందున కేగనీయను. నేఁడీ యర్జునుని పరాక్రమమెట్టిదో కనుఁగొనుటకై స్వయముగ నరుదెంచి యున్నాను.

కృష్ణ—బావా! సుయోధనా? అందుల కేనెంతయు సంతసించుచుంటిని. కాని మానధనుఁడవగు నీవు—ఇంత సిగ్గుచేటగు కార్యమేలయొనరించితివా యని విచారించుచున్నాను.

సుయో—నే నేయకార్య మొనర్చియుంటిని.

కృష్ణ—అది నేను వేరుగ వచింపవలయునా?

సుయో—నీ యభిప్రాయమేమి?

కృష్ణ—బావా! సుయోధనా?

గీ. వీరుఁడనటంచు గొప్పగా • బిరుదుబాల్చి
నట్టి నీవును యాచార్యు•నడిగి యొక్క
కవచమును దెచ్చికొనియు ప•రాక్రమము జూప
సిద్ధమైనాఁడ విదియొక • సిగ్గుచేటు.

సుయో—మానధనుడనగు నేను- కవచ మొక్కటి గలదుగదా యని

యుద్ధమున కరుదెంచితినని తలంచుచుంటివా? ఈకవచమును దీసివైచియే సంగరమున కరుదెంచెద నుండుము.

కృష్ణ—అట్లుగావించిన లోకమంతయును నీవు వీరాధివీరుఁడ వని నుతించును.

సుయో—అయిన నిప్పుడ యరుదెంచెద సందెయుండుము.

కృష్ణ—మంచిది పోయిరమ్ము.

సుయో—(నిష్క్రమించును.)

అర్జు—బావా! చిత్రమగు నాటక మాడించితివి.

కృష్ణ—(నవ్వుచు) ఈసారి సుయోధనుఁడు మరల రణరంగమునకు రాకుండునట్లు గావింపుము

అర్జు—అతఁ డెంతటియభిమానియో తిలకించితివా? కవచమును దీసి వైచి తిరుగ నరుదెంచుచున్నాడు.

కృష్ణ—మరల నాతని నిక్కడకు రానిచ్చుటెందులకు? అక్కడినుండియే యమాలయకు సాగనంపుదము రమ్ము.

(ఇద్దరును నిష్క్రమింతురు.)

సంజ—ముకుందా! అదే! అప్పుడే యర్జునుడు సుయోధనుని సంగరమున కాహ్వానించుచు బాణవర్షమును గురియించుచున్నాఁడు. కాని సుయోధనుఁడును వెనుదీయలేదు సుమా.

ముకుం—కవచవిహీనుఁడగు నితఁడు సులభముగా పరాభవింపబడును. ఈతనిని బారద్రోలిరా! నీవు మొగ్గరమధ్యంబున కలిసినా యాసముగా జేకొనగలరు.

సంజ—సుయోధనునకు నిప్పుడు రానురాను లొల్లు పరుగువారుచున్నారో—కాని యేమిలాభము.

ముకుం—అర్జునుఁ డామూకదాపునకేని రానీయక తరిమివైచును?

సంజ—అయినది. సుయోధనుఁడు వెనుదిరిగి చూచుచున్నాఁడు. దనకు దోడ్పడ నెవ్వఁడైన యరుదెంచుచున్నాడేమో యని జూచు చున్నట్లున్నది.

ముకుం—పార్థుఁ డాతని శరీరమంతయును తూట్లుపడ జేసినాఁడు. అతఁ డట్టే రథముపై మూర్ఛిల్లినట్లున్నది. సారథి రథమును మళ్లిం చుచున్నాడు. (ఇరువురు నిష్క్రమింతురు.)

---

తెర యెత్తబడును.

[ప్రవేశము:—కృష్ణార్జునులు.]

కృష్ణ—అర్జునా! పొద్దు పోవుచున్నది. సైంధవహతకుఁ డెందున్న వాడో తెలియదు. నాయభిప్రాయ మేమన నాతఁడీ మొగ్గర మధ్యంబున నుంపబడి రక్షింపబడుచున్నట్లున్నది.

అర్జు—అవును. కాకున్న సుయోధను డింత సైన్యమును మహాయోధులను యిచ్చట నుంచియుండడు. కాని యా క్రూరాత్ముసి జాడ కనిపెట్టుటయే దుర్లభముగా దోచుచున్నది.

కృష్ణ—పొద్దు వాలినది నాల్గుగడియలు మాత్రమె సూర్యాస్తమయ మునకు వ్యవధిగలదు. ఇందుల కొక్కమార్గము స్ఫురించుచున్నది. (చెవియందేమో జెప్పి) ఇట్లు గావించెదను. జాగరూకతతో పరిశీలించుచుండుము.

[కృష్ణుఁడు చక్రమును విడచును. చక్రము సూర్యుని కడ్డముగ నిలచును.]

అర్జు—అవుడే సూర్యాస్తమయమైన దని కురువీరు లెల్లరును సంతసిం చుచున్నారు గాంచితివా?

కృష్ణ—అవునవును. అదే! చూచితివా? మొగ్గరమధ్యంబున సింధురాజు తన దృక్కులను పడమటి దిక్కునకు బరపి తిలకించుచున్నాఁడు.

అర్జు—ఆతనిని గుర్తించితిని కాని నిరాయుధుఁడై యున్న వానిపై బాణమేయుటకు మనస్కరింపకున్నది

కృష్ణ—బాణమును వింటసంధించి సిద్ధముగానుండుము. ఇంతలో నాతఁడును సంగ్రామ మొనరింపకుండడు.

[సైంధవుఁడు బాణముల వేయును]

అర్జు—అదే బాణముల మనపై బరపుచున్నాఁడు.

కృష్ణ—నీసందేహము నివృత్తియైనదా ? కానిమ్ము. ఆతని శిరంబును పై కెగురగొట్టుము.

అర్జు—(బాణమును విడుచును.)

కృష్ణ—అర్జునా ! వాని శిరమును మాత్రము క్రింద బడనీయకుము. అట్లే యంతరిక్షమున బాణపరంపరతో నాడించుచుండుము. ఇంతలో నేను చక్రము నుపసంహరించెదను

(చక్రము నుపసంహరించును వెలుగు గాన్పించును.)

కృష్ణ—అర్జునా ! ఈపర్యాయము పాశుపతాస్త్రముచే వీని శిరమును హిమాలయముపై తపమాచరించుకొనుచున్న యీతని తండ్రి యంకతలంబున బడునట్లు గావింపుము.

అర్జు—(బాణమును విడచును )

కృష్ణ—అర్జునా ! ఎట్లో ప్రతిన నెరవేరినది. ఇంక నిచ్చట జాలముచే యుండుటెందులకు ? మనరాకకై నిరీక్షించుచు నత్యాతురతతో వేచియుండు ధర్మపుత్రునకీ శుభవర్తమాన మెఱింగింతము రమ్ము.

(ఇరువురును నిష్క్రమింతురు.)

ఇది చతుర్థాంకము.

# దానవీరకర్ణ

## పంచమాంకము

కర్ణుని సౌధము.

[కర్ణుఁ డొక యాసనముపై నాసీనుఁడై యుండును. యాతని కెదుట నొక వృద్ధబ్రాహ్మణుఁ డుండును.]

బ్రాహ్మ—నాయనా! కర్ణా! నీకొక్క హిత ముపదేశింపవలయునని యిట్లరుదెంచియున్నాను.

కర్ణ—ఏవిషయమున—

బ్రాహ్మ—వివరించెదను. ముందుగా నాప్రశ్నల కుత్తరువిమ్ము. భీష్ముఁ డెట్లుపడియెను?

కర్ణ—అర్జునుఁ డన్యాయముగ శిఖండిని మున్నిడుకొని పితామహుని నొప్పించెను.

బ్రా—ద్రోణాచార్యులో?

కర్ణ—ధర్మరాజుఁ డబద్ధమాడ యాతనిని విచారపయోధిముంచి కూల్చి యుండిరి.

బ్రా—ఇంక నేఁజెప్పబోవున దాలింపుము.

కర్ణ—సంసిద్ధుఁడనై యుంటిని.

బ్రా—నినుగూడ వంచనముపై సంహరించు యత్నములు జరుగుచున్న వనుట నీకు తెలియునా?

కర్ణ—ఎఱుగను. కాని నన్నే విధమున వంచింపఁదలయునని వారాలోచిం
చుచున్నారు.

బ్రా—వారి మోసమంతయును నీకుఁ దేటఁబరచి తత్ప్రతివిధానమును
గూడ నీకు దెల్పి యాత్మసంరక్షణ మాచరించుకొనవలసినదని
హెచ్చరించుటకే యిట్లరుదెంచియున్నాను.

కర్ణ—నిక్కముగా తాము మహోపకారమాచరించుటకు నాకై యవత
రించిన మహాత్ములని భావించి నమస్కరించుచున్నాఁడను.

బ్రా—ఇంద్రార్జునులకు సంబంధముగలదనుట నీవెఱుంగుదువుగదా ?

కర్ణ—ఎరుగుదును. అర్జును డింద్రుని కుమారుఁడు.

బ్రా—త్రిదివసామ్రాజ్యమేలుచున్న యా దేవేంద్రుని స్వభావమెట్టిదో
నీవెఱుంగుదువా ? అయినను మరల దెల్పెద నాలింపుము. ఆ
తఁడు తనకు ప్రబలవిరోధుల వంచించి వారివలన దనకెట్టి యిక్క
ట్లును గలుగకుండునట్లు గాపించుకొనుచుండును.

కర్ణ—ఆవిషయమే నెఱుంగుదును.

బ్రా—తన కుమారునకు బలవద్విరోధివగు నిన్ను గూడ వంచించుటకును
తన కుమారునకు జయము గలుగునట్లు జేయుటకును గూడ సం
కల్పించియున్నాఁడు.

కర్ణ—ముల్లోకముల కధినాథుండగు నాతడిట్టి నీచకార్యమొనర్చునా ?

బ్రా—అంతటి నీచకార్యాచరణమునకు సంసిద్ధుఁడై యున్నాఁడని తెలి
యుటవలననే నేను నీకీ రహస్యమెఱింగింప నరుదెంచియుంటిని.

కర్ణ—అసలు విషయమును మరుగుపరచియుంటివి.

బ్రా—ఇంద్రుఁ డేవిధమున నిన్ను వంచించునో దెల్పెద నాలింపుమా.
రణరంగమున నీకెట్టి యపాయమును గలుగకుండ రక్షింపగల
కవచకుండలముల హరింపనెంచియున్నాఁడు.

కర్ణ—ఎట్లు ?

బ్రాహ్మ—ఆతఁడు నిను వంచించుటకై వృద్ధబ్రాహ్మణరూపమున నరుదెంచి కవచకుండలముల నర్థించును.

కర్ణ—నా కవచకుండలములను దానపూర్వకముగా గొననెంచెనా ?

బ్రాహ్మ—అవును. అపుడు నీవు రక్షణ లేనివాడవగుదువు గదా ?

కర్ణ—దానపూర్వకముగా గ్రహింప సంసిద్ధుఁడగునా ? మహాత్మా! ఇంతకంటె వాంఛనీయముండునా ? ఇంద్రుడు ముల్లోకాధినాథుఁడు స్వయముగా వచ్చి నన్నర్థించునా కల్ల! నే నమ్మజాలను.

బ్రాహ్మ—నీతో నసత్యమాడుదునా ? ఇందువలన నాకు గలుగు లాభ మేమి ?

కర్ణ—తమపల్కులు సత్యములే యగును. కాని ఇంద్రుఁడే యరుదెంచి నన్నర్థించిన కవచకుండలములనే గాదు నాప్రాణములనైన యర్పింప సిద్ధముగానుంటిని.

గీ. అర్థిజనములకోర్కెల • నరసిదీర్చు
కల్పకములకు నేత యా • ఖండలుండు
యట్టి యాతఁడె వచ్చి న • న్నడిగికొనిన
నెట్లు లేదనుచును నే వ • చింపగలను.

తప్పక యాతని యభీష్టమునుదీర్చి పంపువాడను.

బ్రాహ్మ—నాయనా కర్ణా! వలదు వలదు. అతని కీదానము నీయ వలదు. నాపలుకు లాలింపుము. కవచకుండలములను గోలు పోయిన నీవు సులభముగా నిర్జితుఁడవగుదువు నాపల్కుల యందలి యదార్థమును గుర్తింపుము. మోసపోకుము.

కర్ణ—నన్ను మోసగింపదలఁచిన మహేంద్రుఁడే మోసగింపబడును. సందేహము లేదు.

బ్రా—ఎట్లు ?

కర్ణ—నాకు చిరంబగు యశమును గూర్చిపెట్టినవాడగును. ఆతని మో
సమునుగూర్చిన యపకీర్తి తారాచంద్రార్క మీయిలాతలం
బున నుండగలదు. కవచకుండలవిహీనుండై నని సేసియు కర్ణుం
డర్జునునితో సమముగా బోరగల్గెనను యశము లభించును. ఇం
తమాత్రము జాలదా? మహాత్మా!

బ్రా—కర్ణా! నాపల్కులాలింపుము. ఏదానమువలన నాత్మకు నాశ
నమొసంగగలదో యాదానమొసంగరాదనుట పెద్దలమతంబు.

గీ. వంచనను చేసి నీ ప్రాణపంచకంబు
గైకొనదలంచు నట్టి యాఖండలునకు
దాన మీయంగవలదు అంద్దానివలన
దోస మినుమంత గూడ లేదో కుమార.

మరియు ఆత్మనాశనమును గమనింపక చేయు దానమును దాన
ముగాదని పెద్దలు వచించుచుందురు. కావున యాఖండలునకు
నీవు కవచకుండలముల నర్పింపవలసిన యగత్యముండదు.

కర్ణ—ఓ మహాత్మా! మీరెన్నివిధముల బోధించినను నామనస్సు
దరుగదు. అర్థినవి వచ్చిన యాతనిని సంతోషపరుపకుండ నేన
న్నటికి బంపజాలను. ఇది నాప్రతిజ్ఞ.

బ్రా—(స్వగతమున) ఈతని డీవిషయమున కృతనిశ్చయుండై నట్లు
గాన్పించుచున్నది. (ప్రకాశముగా) కర్ణా! ఆత్మవినాశనము
నకు మూలమగు దాన మొసంగవలదని శుక్రు డెంత వారించినను
వినక యాబలీంద్రు డెట్టియాపదలకు బాలయ్యెనో యెఱుం
గుదువు గదా?

కర్ణ—ఎట్టియాపదకును బాల్పడియుండలేదు భక్తలోకైకమందారుని
యనుగ్రహమును బడయగల్గెను. భూసురోత్తమా! ఇంక నావి
షయమును గూర్చిపల్కుచు నామనంబును కలతనొందింపకుడు.

బ్రా—(స్వగతమున) ఇంకేమి సేయుదును. నానిజస్వరూపమును జూపి మరల ప్రబోధించెదను గాక.

[నిజస్వరూపమును ధరించును.]

సూర్య—కుమారా! కర్ణా! ఇంతవరకును ప్రచ్ఛన్నముగానుండి యేమేమో బోధించియుంటిని. నాపలుకులు నీకు రుచింపవయ్యెను. నేను వాస్తవమెఱిగించుచుంటిని. ఇంద్రునకా దానము నొసంగవలదు.

కర్ణ—గురుజనంబుల పలుకుల కెదురాడవలసివచ్చినందులకు మన్నింపవలయును. అర్థిని సంతోషపరుపకుండ వెనుకకు పంపజాలను. పూజనీయులగు తమరు నాబోంట్లకు సద్ధర్మముపదేశింపవలయును గాని యిట్లుపదేశింపవచ్చునా?

సూర్య—ఇంద్రుడు తనకుమారు నెట్లు రక్షించుకొనదలంచెనో యట్లే నేనును నిన్ను సంరక్షించుకొనుటకు యత్నించుచుంటిని. దానమొసంగుటకు కృతనిశ్చయుడవైన నీతో నేమనినను లాభము లేదు. ఇంద్రునికడ నమోఘమైన శక్తియొక్కటిగలదు. అద్దానిని గ్రహించి యాతనికీ కవచకుండలము లర్పింపుము.

కర్ణ—ఎందులకు?

సూర్య—అయ్యది యమోఘమైనదని వచించియుంటిని గదా? అద్దానివలననైన నీవర్జునుని సులభముగా నిర్జింపగలుగుదువు.

కర్ణ—దానమునకు ప్రతిఫలమును గొనవలయునా? అది కానిపని. అట్లొనరింపజాలను క్షమింపుడు.

సూర్య—నీకు దెలుపవలసినదంతయు చెప్పియుంటిని యటులైన నీయిష్టమెట్లో యట్లే ప్రవర్తింపుము.

(సూర్యుడు నిష్క్రమించును)

కర్ణు—సూర్యభగవానుఁడు వచించిన ట్లొనర్చ్ఁజాలను. అట్టి యకార్య మొనర్చుటకంటె నెట్లో జీవముల త్యజించుట రే యుత్తమము బుద్ధ్యధప్రాయములగు జీవముల గాపాడుకొంటకై యకార్యా చరణమున కే నంగీకరింపను.

[ ప్రవేశము:—సేవకుఁడు. ]

సేవ—(కర్ణునకు నమస్కరించి) దేవా ! సుయోధనసార్వభౌములు సభా రంగమున తమకొరకు నిరీక్షించుచున్నారు.

కర్ణు—ఇదే యరుగుచుంటిని.

(ఇరువురును నిష్క్రమింప తెర వ్రాలును.)

---

## ద్వితీయరంగము.



సుయోధనుని దర్బారు

[సుయోధనుఁడు. అశ్వత్థామ, కృపాచార్యులు, శల్యుఁడు, శకుని మున్నగువారు యుచితాసనములపై గూర్చుండి యుండగా తెరలేచును.]

అశ్వ—సార్వభౌమా ! మున్ముందుగా సర్వసైన్యముల కధినాయకు నిగా నొక్కని కభిషేకముగావించి కర్తవ్యమును గూర్చి యా లోచింపవలసి యున్నది.

సుయో—ఈవిషయమును గూర్చి సమాలోచనము సల్పుటకై యంగ రాజునకు రావలసిన దని వార్త బంపియుంటిని.

కృపా—సమయము ననుసరించి ప్రవర్తింపవలసియున్న నీయదనున యాలోచనములతో కాలయాపన మొనర్చు టెందులకు ? అంగ

రాజునకు సేనానాయక పదవి యొసంగుము. ఇప్పటి మనసైన్య
మున శ్రేష్ఠుఁడనగిన వీరవరు డాకర్ణుఁడని తలంతును.

అశ్వ—సైన్యమున కాధిపత్యము వహించుట కాతఁడే తగియుండును.
(తనలో) ఈపిడుగు నాతలపై బడకుండ తప్పించుటకై మామ
గారు మంచిమార్గమును ద్రొక్కియున్నారు.

శల్యు—అదే! యంగరాజేందుఁ డరుదెంచుచున్నాడు.

[ప్రవేశము:—కర్ణుఁడు.]

కర్ణు—నాకొరకై వేచియుంటిరి గాఁబోలును మన్నింపవలయును.

సుయో—కృపాచార్యులవారు నిన్ను సైన్యమున కధినాయకునిగా నభి
షిక్తుని గావింపవలసిన దని నుడువుచున్నారు. ఈవిషయమును
గూర్చి యాలోచించుటకే నీకొరకు వేచియున్నారము.

కర్ణు—దుర్యోధనసార్వభౌమా! వారట్లు హితోపదేశము గావించుట
యుక్తము కాని నేనట్టి పదవి కర్హుఁడనగుదునా? ముల్లోకము
లొక్కపెట్టున నెత్తివచ్చినను పోరాడగల వీరశిఖామణి యగు
గురుపుత్రుఁడుండ- ఆచార్యులతో సమానమగు కోదండపాండి
త్యము గల కృపాచార్యులవారుండ నీవు నాకు సేనానాయకపద
మొసంగుటకు దలంచుటలో నించుక పొరబడుచుంటివి.

శకు—సార్వభౌముఁ డీవిషయమున పొరబడుట లేదని వచింపవచ్చును.

కృపా—అంగరాజా! నీవనినటు మేము శరచాపముల ధరించి యుద్ధ
ము సేయగలుగుదుము గాని సైన్యముల నడపునంతటి సామ
ర్థ్యము గలవారమా?

అశ్వ—సుయోధనా! అపుడే యిరు తెగలవారును రణరంగోన్ముఖులై
నడచుచున్నారు. ఇంక జాగొనరింపకుము.

కర్ణు—ఈసమయమున నే నింకొక విషయముగూడ దెలుపవలసియున్నది.

ఈవు నన్ను సమస్తసైన్యములకు నాయకునిగావింపకున్న నేను నిన్నన్యథా తలంతునేమో యని తలంపకుము. సేనానాయకుండను గావలయునను యభిలాష నాకెన్నడును లేదు. కావున తగినవారల నభిషిక్తుని గావింపుము.

శకు—(తనలో) కర్ణుఁడు కృపాచార్యులను గాని యశ్వత్థామను గాని సేనానాయకునిగావించుట యుక్తమని సూచించుచున్నాఁడు. కాని సుయోధనునకు బ్రాహ్మణులపై నింక నమ్మికగల్గుట యరుదు.

సుయో—మిత్రమా! రాధేయా! నే నన్నివిషయములను విమర్శించియే యిట్లు గావించుటకు నిశ్చయించుకొన్నాను. నీవు నాయకత్వము వహించిన నాకెట్టి కొఱంతయు గలుగబోదని విశ్వసించుచున్నాను.

కర్ణు—అయిన నట్లే కానిమ్ము.

అశ్వ—సార్వభౌమా! అభిషేకమునకు గావలసిన పదార్థములన్నియు సంసిద్ధముగానుంచి యందే విప్రపుంగవులు మీరాక కెదురు చూచుచున్నారు. యుద్ధమున కాయత్తమై సైన్యములన్ని సిద్ధమైయున్నవి. ఇంక తడయు టెందులకు? యథావిధిగా నభిషేక కార్యమును ముగించుకొని సమరమున కరుగుదము.

(అందరును నిష్క్రమింతురు.)

తెర వ్రాలును.

# తృతీయ రంగము.



## కర్ణుని సౌధము.

[కర్ణుఁడు ఒక సోఫాపై గూర్చుండియుండగా తెర యెత్తబడును.]

కర్ణు—(సాలోచనముగ)

గీ. ఒకతల్లికి నుద్భవ • మొందినట్టి
వారమగు మేమయో పర•స్పరము జంపు
కొనుటకై సిద్ధమైతిమి • వనజగర్భు
వ్రాత దప్పించి నడువ నె•వ్వని తరంబు.

కాని యీవిషయమునుగూర్చి యాలోచించినకొలదిని మనం బూరక కలవర మొందుచున్నది. సేనాధర్మమును చక్కగ నిర్వర్తింపఁదలంచువాఁ డిట్టివిషయములచే నెప్పుడును కలత నొందఁడు.

[తెరలో]

దానకర్ణులని లోకైకవిఖ్యాతి నందిన యంగనృపాలుఁడెందున్నవాఁడో యెఱింగించెదరా? అర్థులపాలిటి కల్పవృక్షమగు నాతని సందర్శించి తరింపనుంటిని.

కర్ణు—ఎవ్వరో బ్రాహ్మణు లర్థాపేక్షతో నరుదెంచియుండురు. (లేచి ప్రక్కకేగి) అయ్యా ! ఇట్లు దయచేయుఁడు.

[ ప్రవేశము:—బ్రాహ్మణవేషమున దేవేంద్రుఁడు ]

ఇంద్రు—(స్వగతమున) ఇంతవరకు నాయొనర్చిన ప్రయత్నములన్నియు సఫలములైనవి. నేఁ డీతని కవచకుండలములనుగూడ హరింపఁ గలిగితినేని తప్పక యీతఁడు రణరంగమున నర్జునునిచే నిహతుఁడగును. అపుడు నావిచార మొకింత యుపశమింపగలదు. (ప్రకాశముగ) ఆహా ! ఏమి నాభాగ్యము.

చం. అడుగక విప్రకోటి కభిలార్థములన్ సమకూర్చి పంపుచుం
డెడిపరమార్థచింతనము • డెందమునందున నిల్పి దాన క
ర్ణుఁడు యగునంచు లోకముల • రూఢికి నెక్కినపుణ్యమూర్తి యీ
తఁడ యగు; నేఁడు నా కితని • దర్శనభాగ్యము గల్గె వింతగా.

ఇట్టిపుణ్యమూర్తిని సందర్శించుటచే నాజన్మము తరించినది నా యదృష్టమును గొనియాడఁ తరమగునా?

కర్ణ—మహాత్మా! ఆ యాసన మలంకరింపుఁడు.

[ఇంద్రుఁ డొక యాసనముపైఁ గూర్చుండును.]

ఇంద్ర—అంగరాజేంద్రా! ఆశాంతములవఱకు వ్యాపించియున్న నీయశం బిట్టి దని వక్కాణింప నాతరమగునా? ఈధరావలయంబున నీవలన దానమును పరిగ్రహింపకున్న భూమీసురుం డొక్కఁడుఁగూడ నుండఁబోఁడని వక్కాణించుటయందు లవమేని యసత్య ముండఁబోదు.

కర్ణ—నిక్కమునకు తా మీవిషయమున పొరబడుచుంటిరి. మన భరతఖండమున నిప్పటికిని నప్రతిగ్రహీతులగువారు వేనవే లున్నారు. అట్టివా రుండుటవలననే లోక మీవిధముగ నడుచుచున్నది. లేకున్న వేఱె యడుగవలయునా?

ఇంద్ర—ఒకానొకవేళ నీవనినట్లుగా నప్రతిగ్రహీతు లుందురుగాని వా రర్థార్థులు కారు. భవదీయ కరవిముక్తదానధారోదకము నిర్ఝరాపగవోలె ముల్లోకంబుల ప్రవహించుచున్నది. నేనును-అర్థినై నీసందర్శనమున కరుదెంచితిని.

కర్ణ—మహాత్మా! అనుగ్రహింపఁబడితిని తమకుఁ గావలయునేని వలసినంతద్రవ్యమును గొనిపొండు.

ఇంద్ర—ద్రవ్యమా! (నవ్వును)

కర్ణు—ఏ మట్లు నవ్వెదరు ?

ఇంద్రు—ధన మెందులకు—.

కర్ణు—ధనమువలన ప్రయోజనమే లేదా ?

ఇంద్రు—ఉన్నది- లేకున్నది. నేనీవఱకు హాయిగ గుండెలపైఁ జేయివేసికొని నిద్రింపఁగలుగుచుంటిని. నీచెంతనుండి ధనమును గొని పోయితినా ? దానికొఱకై యహర్నిశలు చోరభయంబున జాగరూకత వహించి యుండవలయును.

కర్ణు—సువర్ణశృంగంబులతో నలంకరింపఁబడిన గోసహస్రము నంగీకరింపుఁడు.

ఇంద్రు—(మరల నవ్వును.)

కర్ణు—గోసహస్రము నేల పరిగ్రహింపరు ?

ఇంద్రు—ధనసంరక్షణమునకై పడవలసినపాట్లకెక్కుడుగా ధేనువుల సంరక్షింప నవస్థ పడవలయును గదా ? అయినను- గోసహస్రమును గొనిపోయి నన్నేమి వర్తకము సాగించుకొమ్మందువా ?

కర్ణు—చతురంగబలంబుల నొసంగెదను. చిరకాలమునుండి నాభుజాస్కంధములఁ దొలుకాడకుండ నిలిచియున్న యంగరాజ్యము సమర్పించెదను గైకొనుండు.

ఇంద్రు—(నవ్వుచు) రాజ్యపరిపాలనమా !

కర్ణు—సామ్రాజ్యము నేలుట తమవంటిప్రజ్ఞానిధులకు సులభసాధ్యము గాకుండునా ?

ఇంద్రు—రాష్ట్రపరిపాలనమా ! ఇంతకంటె యనర్థదాయకము వేఱొకటి యున్నదా ?

కర్ణు—ఏ మటందురు ?

ఇంద్రు—'రాజ్యాంతే నరకం ధ్రువ' మ్మని పలుకుట వినలేదా ?

కర్ణు—విని యుంటిని.

ఇంద్రు—మఱియొకవిషయము. బీదపాఱుడనగు నాకు రాజ్య మెందులకు ?

కర్ణ—మహాత్మా! తమరు నన్నర్థింపఁదలంచిన దేమున్నదో వచించి నన్ను సంతసపరుపుడు.

ఇంద్రు—(ఊరకుండును.)

కర్ణ—సంకోచించెద రేల ? కర్ణుఁ డాడితప్పువాఁడు గాఁడు. తమ రేమ డిగినను లేదన కిత్తును.

ఇంద్రు—నీ వంతటివాఁడ వగుదువు.

కర్ణ—అయినయెడల తాము సంకోచించుచు నూరకుండు టేల ? (తన లో) ఈతఁడు తనవాంఛితమును దెలుపకుండుటకుఁ గారణ మేమైయుండును—లజ్జితుఁడై యుండునా ?

ఇంద్రు—కర్ణా ! అర్థించుటయే కాని పని యగునందువా ?

కర్ణ—చిత్తము. ఒకరి నడుగుటకే కష్టముగా నుండును.

ఇంద్రు—ఎట్లో యడిగినను- దాత లేదని వచించునెడల నాయర్థి యెంతగా విచారించునో యూహించితివా ?

కర్ణ—అప్పు డాతనికష్టము ద్విగుణీకృత మగును. కాని ధరామరేంద్రా! మీ రేల సంశయించెదరు. తాము కోరునట్టి వస్తు వేదియైన నొసఁగఁగలవాఁడను. తమరు నాజీవములనే కోరుకొనినయెడల నిశ్చయముగా నొసంగి తమ్ము సంతోషపఱచి యుందును.

ఇంద్రు—అవుడుకదా ! నీయీవి తెలియనగును. కాని నాకు నీప్రాణములతో నిమిత్త మేమున్నది ?

కర్ణ—ఇంక తడయనేల ? తమవాంఛిత మేమో తెలియఁజేయుఁడు ?

ఇంద్రు—అంగరాజా !

కర్ణ—తమకోరిక తీర్చుటకు సిద్ధముగానుంటిని తెలుపుఁడు. (తనలో) ఈతఁ డిట్లు సందేహించుచుండుట దిలకింపఁగా నింద్రుఁడే వచ్చి

యుండునని తోఁచుచున్నది. అట్లే యగును. కానినాఁడు తన వాంఛితమేమి తెలుపకుండ నిటు సామాన్యులు సంకోచింపరు (ప్రకాశముగా) మహాత్మా! అమూల్యములును- నాశరీరము తోడ లభించినవియును యగు కవచకుండలముల నొసంగుదును గైకొని యనుగ్రహింపుఁడు.

ఇంద్రు—(సంతోషముతో) తెమ్ము! తెమ్ము. సంతోషితస్వాంతుఁడనై యరిగెదను.

కర్ణ—(కవచకుండలములను ఖండించి యొసంగి) త్రిదివసామ్రాజ్యాధిపతులగు తామర్థించిన నేను లేదనువాఁడనా? ఇంతకాల మూరక సంకోచించితిరి. తమబోంట్లను సందర్శించుటచే ధన్యుఁడనైతిని.

ఇంద్రు—(వానిని గ్రహించి) అంగరాజా! అకల్పాంతస్థాయియగు యశమార్జించితివి. ఇట్టి నిన్ను నే నెంతయు నభినందించుచు న్నాను. నీవు యుద్ధమున నర్జునుని జయింపనెంచి యుంటివి. కావున నీకొక్క యమోఘమగు శక్తి నొసంగుచున్నాను. ఆశక్తి నీయిచ్చవచ్చినవాని నొక్కరుని వధించి తిరుగ నను జేరును.

కర్ణ—ఇచ్చినదానమునకు మాఱుగా నీశక్తిని గ్రహింపను. అయ్యా! నాకేశక్తియును వలదు. స్వశక్తిచే నర్జును నోర్చెదను. అపుడే నాకు యశంబు కలుగును. లేదా? అతనిచే మడిసి దివ్యసంపదల చేకొందును.

ఇంద్రు—వత్సా! నీదానమునకు ప్రతిగా నొసంగుట లేదు. నీకు నే నియ్యది వరంబుగా నొసంగుచుంటిని గ్రహింపుము. సంకోచింపకుము.

కర్ణ—తమచే నేఁడు నిక్కముగ ననుగ్రహింపఁబడినాఁడను.

ఇంద్రు—ఆచంద్రతారార్కము కీర్తికాయుఁడవై వెలుంగుదువుగాక !
(ఇంద్రుఁడు నిష్క్రమించును.)

కర్ణు—వరముగా నొసంగిన ఈశక్తియే యర్జును నోహటింపఁగలదు. అర్జునుఁడు గాక నాకు బలవద్విరోధి యెవ్వఁడున్నాఁడు. నేఁడే యాతనిని గూల్చి సార్వభౌమునకు సంతసము చేకూర్చెదను
(నిష్క్రమించును.)

తెర వ్రాలును.



## తురీయరంగము.

[శల్యుఁడు సారథ్యము సేయుచుండగా కర్ణుఁడు రథికుఁడై ప్రవేశించును.]

శల్యు—అర్జునుఁడు మిక్కిలి కపీరుఁడు. ఆతఁ డిట్టివాఁడని వక్కాణించుట సాధ్యమని తలంతును.

సీ. ఖాండవారణ్యంబు ♦ గాల్పించి యగ్నిచే
గాండీవమును బొంద ♦ గలిగినాఁడు
రాక్షసిమూక పోరాటమున వధించి
యింద్రుని సరి గద్దె ♦ నెక్కినాఁడు
పందికై పోరాడి ♦ పరమేశు మెప్పించి
పాశుపతంబును ♦ బడసినాఁడు
గంధర్వులను ద్రోలి ♦ కౌరవేశ్వరుఁ బ్రోచి
యన్నచే మన్నన ♦ లందినాఁడు
విరటు గోవులఁబట్టిన ♦ వేళయందు
నొంటి నేతెంచి మిమ్ముల ♦ నోహటించి

మూర్ఛగప్పించి నోడించి • పోయినాడు
యట్టివానితో ననిసేయు • టెట్లు వి యెఁగెనె.

కర్ణ—అర్జునుని పరాక్రమమెట్టిదో యెఱుంగనివాఁడను. గాని—

శల్య—అపృథాతనయుని విక్రమంబెట్టిదో నెఱింగియు వా డాతనితో ననిసేయ దలంపదు నీవాతనిని జయింపఁగలనని తలంచుచుంటివి గాఁబోలును.

కర్ణ—నేటియుద్ధమున మాయిరువురి తారతమ్యంబు లరయఁగలవు గదా!

శల్య—నేఁడేగాదు. మీ యిరువురి తారతమ్యమును తొలుతనుండి యును గాంచుచునే యుంటిని.

గీ ద్రౌపదికొఱకు మీరు యు•ద్ధంబుసలుపు
నాఁడు, గంధర్వులను ద్రోలు•నాఁడు, సింధు
రాజును వధయించునాఁడును, • రణమునందు
నెవ్వరధికులో లోకుల • కెఱుకఁబడియె.

నాఁడు లేని పరాక్రమము నేఁడు నీకెట్లులభించె ననుకొనుచున్నావు.

కర్ణ—ఓయీ! భట్టువలె నూరక నాయర్జును వేలయగ్గించెదవు. నేటి యుద్ధమున మాయిరువురిసంగ్రామంబును దిలకించి యటుపై నీ యిచ్చవచ్చినవారిని నుతింపుము. కాని రథంబు వ్రోనిమ్ము.

శల్య—చూచినపిమ్మట నాకే కాదు ముల్లోకంబులవారలకు నీవిక్రమంబెట్టిదో తెలియఁగలదు. కురురాజు కార్యార్థమై నీకుఁ దేరు నడపు నాకు దగినవిధంబున హితోపదేశ మొనర్పింపవలసియుం డుటచే నట్లానర్చితిని. పిమ్మట నీచిత్తమెట్లో యట్లే గావింప దను. (రథమును నడపును)

కర్ణ—ఓరణవీరులారా! బాహుబలగర్వదుర్విదగ్ధుండగు నాపార్థుఁ డేపఁ లన సంగరమాచరించుచున్నాఁడో నాకెఱుంగఁజేసిన మొదల మీరు కోరఁకొనిన పసదనంబుల నొసంగువాఁడను.

శల్యు—రాధేయా! నీ యవివేక మిప్పుడు నిక్లేల ప్రకటించుకొను చుంటివి ?

కర్ణు—ఏమి ?

శల్యు—అర్జును నొక్కరు నీకుచూపవలయునా ? ఎంతయవివేకము. కపిధ్వజముతో ప్రళయగంభీరనినదంబు ననుకరించు దేవదత్త ధ్వానంబుతో భగవానుండగు శ్రీకృష్ణుఁడు సారథియైయుండ రణంబున కరుదెంచి వివిధాస్త్రపరంపరల నీకురుసైన్యంబు నొక్కడ చిందరవందరసేయు నాయర్జునుని యొక్కరు జూపవల యునా ? ఆతఁ డెంతటివాని దాగికొనుననుకొంటివా ?

కర్ణు—ఇంక చాలించుము. ఒకిరీటి పరాక్రమముగ్గడించి నన్ను వెఱపింప నెంచితి వైనను నీ నూదుమాటల కేనెంతమాత్రమును వెఱ పింపబడువాఁడను గాను. ముందుగ రథంబును బోనిమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

[ప్రవేశము:—సంజయుఁడు, ముకుందుడు.]

సంజ—ముకుందా! రమ్ము రమ్ము. సమర మప్పుఁడే ప్రారంభమైన ట్లున్నది. కర్ణుఁ డల్లదే యుద్ధమున కాయత్తమై జనుచున్నాఁడు.

ముకుం—అదేమి! కర్ణునకు శల్యసారథ్యమా! ఎంతటి ప్రారబ్ధము.

సంజ—అ ట్లనుదు వేమి ?

శల్యు—శల్యుడు ధర్మజాదులకు మేనమామ గదా ?

సంజ—అయినను సుయోధనున కరిగాపు గావుననే యీపని కాతడు నియమితుఁడై యుండును.

ముకుం—అదే! శరవేగంబున నేగుచున్న సూతాత్మజున కడ్డంబుగ నకులుఁ డరుదెంచి యాతనిపై బాణపరంపర బరపుచున్నాఁడు.

సంజ—కర్ణుని బాణములా నకులునకు ప్రత్యుత్తర మొసంగగలవు పార్థుఁ డొక్కడే యాతని నోర్వగలడు. కాని తక్కినవా రాతనిచే

నోటువడుదురు. భీమసహదేవులాతనికోడి పరుగిడినవారుగారా?

ముకుం — అట్లుతలంపరాదు. భీముఁ డవక్రవిక్రముఁడు. ఒకవేళ సమయము తప్పివచ్చినప్పుఁ డోడినేమోగాని- యూతఁడుగూడ కర్ణనోహటింపగలడు.

సంజ — నకులుఁడును కౌంతవలకు గర్ణునితో సమయుద్ధము గావించుచున్నాఁడు.

ముకుం — సమయుద్ధమా! కాదు కాదు. కర్ణు డొక్కమార్గణంబున కేతువు నిలగూల్చి బాణద్వితయంబున సూతుని తలదుంచి పదిబాణముల చక్రరక్షకుల దునిమి యిరువది శరముల రథమును నుగ్గుగావించినాడు.

సంజ — నకులుని సాహసము దిలకింపుము. వాలుగైకొని పోరాడ దిగ్గన నేలకురికి కర్ణుని గలయ నేగుచున్నవాఁడు.

ముకుం — అయినది. నకులుని పస బయటబడినది. పరుగిడుటకు బ్రారంభించినాఁడు.

సంజ — మాటలాడకుము. కర్ణుఁడేమో యనుచున్నాడు.

[తెరలో]

నకులా! స్వపరతారతమ్యంబు లెఱుంగక కయ్యంబునకు సిద్ధమై పగతుర వెన్నాసంగి పరుగిడుచుంటివా? యిద్దేటిపౌరుషము నీకు శక్తి లేకున్న నీయగ్రజుండగు కిరీటి నియ్యెడకు బంపుము పొమ్ము. నీకేల యీయుద్ధము.

ముకుం — చూచితివా? యెట్లు నకులుని యవమానించుచున్నాడో?

సంజ — (నవ్వుచు) నకులుఁ డాపల్కులను వినని కైవడి పరుగిడుచున్నాడు.

ముకుం — అదే ముందునకు దిలకింపుము. నకులుఁడు వెనుసూపి యుర్గుగుచుండుట దిలకించి ధర్మతనూజుఁడు కర్ణు నెదుర్కొనుటకు దలపడుచున్నాడు.

సంజ—తలపడుటయే తడవుగా కర్ణుఁడాతని విరథుని గావించినాఁడు.

ముకుం—భళీ! ధర్మనందనా! వీరుడవన నీవే? కర్ణుని చేనున్న విల్లు నవలీల దునుమాడితివి.

సంజ—వేఱొక విల్లును గైకొని కర్ణుండాతని చాపంబును నడిమికి ఖండించెను. అంతతో నూరకుండెనా? మార్గణనికాయముల నాతని మేనెల్ల తూట్లువడ జేసెను.

ముకుం—అయ్యయో! పాండవాగ్రజుఁడు హతసారథికంబగు రథంబును మరలించుకొని చనుచున్నవాఁడు.

సంజ—కర్ణుఁ డాతని వెంబడించుచు నిల్లే యరుదెంచుచున్నాడు.

[ప్రవేశము:—కర్ణుఁడు]

కర్ణ—ధర్మరాజా!

"సీ. క్షత్రియకులమున ♦ జన్మించి యిది ధర్మ
మిది యధర్మం బని ♦ యెల్ల నెఱిఁగి
నట్టి నీకిట్టి మ♦హాహవమునఁ బ్రాణ
ములు దాఁచికొన శాత్ర♦వులకుఁ. దొలఁగి
పోవుట దగునె నీ♦బుద్ధి గానఁగ నయ్యె
నృపనీతి యెఱుగవు ♦ నీవు బ్రాహ్మ
ణాచ్చార వేదివి ♦ యాగాధ్యయనముల
వర్తింపు కయ్యంబు ♦ వలవ దుడుగు
మింక ననుఁబోటిఁ దొడరిన ♦ నింతకంటె
నెదరు వాటిల్లు వేగ పో♦మ్మింటి కడకు
హరియుఁ బార్థుఁడు నున్నెడ♦కైన నరుగు
మేను దెగనీదు ప్రాణాన ♦ కింత నిజము."

[తెరలో కలకలము.]

కర్ణ—ఏమూ! కలకలము. (ముందునకు జూచి) అయ్యెడ సేమద

మతిఘోరముగా జరుగుచున్నట్లున్నది కవ్వడియు నాప్రాంతమునసే యుండవచ్చును. దుర్యోధన సార్వభౌముఁడు గూడ నాప్రాంతములనే యుండుట గలకించియుంటిని. అతని సవర్స్యము రక్షింపవలయును. (నిష్క్రమించును)

ముకుం—కర్ణుఁడు కిరీటితో వెలపడబోవుచుండ వెనుగొండవలె భీమసేనుం డడ్డుతగిలి కృతాంతుని చందంబున చిల్లరిమూకలం బారదోలి కర్ణునిపై గులిశాయుధంబును ప్రయోగించినాఁడు.

సంజ—కర్ణుఁడు- తొల్లి భీమసేను నవమానితుని గావించిన కర్ణుఁడు. భీమసేనున కోడి రథంబుపై బడి మూర్ఛిల్లియుండెను.

ముకుం—భీముఁ డదేమి ప్రళయకాలరుద్రునిభంగి మండిపడుచు కర్ణుని రథంబుపై కరుగుచున్నాఁడు. ఆ- ఆ- కర్ణుని వధింపబోవుచున్నాఁడే.

సంజ—ఈతఁ డర్జునుని ప్రతిజ్ఞకు భంగము గావించునేమో!

ముకుం—సంజయా! లేదు లేదు, మద్రభూపతి భీమసేనుని శాంతింపజేసి వెనుకకు బంపియున్నాఁడు.

సంజ—మద్రభూపతి రథంబు నవ్వలికిఁగొనిపోయి కర్ణుని సేదదీర్చుచున్నాఁడు.

ముకుం—సేదదీరుట కెంతెగావలయును. అదే మరల రణరంగమునకు బోవుచున్నాఁడు.

సంజ—కవ్వడియు కర్ణు నెదుర్కొనుటకు సంసిద్ధుఁడగుచున్నాఁడు.

ముకుం—అదేమి? గాఢాంధకారము సలుగడల కమ్ముకొనుచున్నట్లుగా కారుమేఘము లలముకొనినట్లుగా నెడతెగని లేకుండ బాణవర్షమా కవ్వడిపై గురియించు నాతఁ డెవ్వఁడు?

సంజ—ఏమిది? కర్ణుని బాణములన్నియు వ్యర్థమగుచున్నవే? ఆ ఆ! కర్ణుని కేతువు నేలపై బడినది. రథము శిథిలమైనది.

ముకుం—చూడు చూడు. కర్ణుఁడెంతగా చీకాకుపడుచున్నాఁడో? బాణ మెవ్వరిపై విడువవలయునో తెలియమిచే కళవళపడుచు నచేష్టుఁడై యున్నాఁడు.

[ ప్రవేశము:—కృష్ణార్జునులు. ]

అర్జు—బావా! ఏమీగాఢాంధకారము. ఈతిమిరంబున నెవ్వనిపై బాణమును విడచిన నేమిప్రమాదము గలుగునో యని శంకించుచున్నాను.

కృష్ణ—అవును. నీ వట్లుంటివనియే రథము నీవంకకు గొనివచ్చినాఁడను.

అర్జు—సమరరంగమునుండి యిట్లరుదెంచియుండుట భావ్యమా!

కృష్ణ—అట జరుగుచున్నదేమో యిక్కడనుండియే గనుగొనవచ్చును. అట్లుగాక మనమచ్చటనే యున్నయెడల మనముగూడ నాయంధకారబంధురమున మునిఁగిపోవుదుము.

అర్జు—ఇక్కడనుండి మాత్రము మనము చేయగల కార్యమేమున్నది?

కృష్ణ—అదిగో దిలకించితివా! ఈవంకజూడుము. ఘటోత్కచకుమారుని పరాక్రమము.

అర్జు—ఏమీ ఘటోత్కచకుమారుని యుద్ధమా! ప్రళయమే సంభవింపనున్నదనుకొంటిని.

కృష్ణ—ఇదిగో యీవంక గనుంగొనుము. కర్ణుఁ డేమిచేయుటకును దోపక వింటబాణమును సంధించి నిలువబడియున్నాఁడు. ఇట్లొకటి రెండు యామములు పోరుసాగిన మనము చేయవలసిన పని సులభమగును.

అర్జు—ఘటోత్కచా! మేలు మేలు. నీసాహసపరాక్రమముల కేనెంతయు సంతసించితిని.

సంజ—ముకుందా! వింటివా? మాయాయుద్ధవిశారదుఁడగు భీమసేనకుమారుఁ డగు ఘటోత్కచుని యుద్ధమట.

ముకుం—నేనే కాదు. కర్ణుడు గూడ యీపల్కు లాలించియున్నాడు.

సంజ—కావుననే వింటసంధించిన బాణమును విడచినాడు.

[తెరలో కలకలము. ఘోషముతో ఘటోత్కచుడు నేలగూలును. తిమిరమంతయు నంతరించును.]

అర్జు—బావా! ఏమీ కలకలము.

కృష్ణ—కర్ణుఁడు ఘటోత్కచుని జయించియుండును.

అర్జు—కుమారా! (మూర్ఛిల్లును)

కృష్ణ—బావా! ఏమి వెఱ్ఱి. ఈతఁడు నీకుమారునికంటె నెక్కువవాఁడా! అట్టివానికొఱకై శోకించుట తగదు. మఱియొక విషయముగూడ నాలింపుము. మహేంద్రుఁడొసంగిన యమోఘమగు శక్తిని నీకొఱకై యీతఁడిన్నినాళ్ళును దాచియుంచెను. అద్దానిచే నేడు ఘటోత్కచుని మ్రందించెను. ఇఁక నీవిషయమున నేను వెరువవలసినపని లేదు.

అర్జు—అయ్యో! కుమారా! నిన్ను పగతురకప్పగించి నేను జీవించియుంటినా? కృష్ణా! ఇదంతయును నీమాయగానున్నది.

కృష్ణ—కుమారుని వధించెనని రోసమున వైరినిదాకుటకు మారు శోకించుచుంటివా? ఇట్లాఁడుదానిపని సేయుదువా?

అర్జు—ఏమంటివి?

కృష్ణ—అనుటకేమున్నది? కర్ణుని నుక్కడింపుమంటిని.

అర్జు—నేఁడే కర్ణుఁడుండఁబోఁడు. రమ్ము రథమెక్కుము. నేఁడే యర్జునుని పరాక్రమ మెట్టిదో తిలకింతువు గాక.

(ఇరువురును నిష్క్రమింతురు.)

తెర పడును.

# దానవీరకర్ణ

## షష్ఠాంకము

[ప్రవేశము:—సంజయుఁడు, ముకుందుఁడు]

సంజ—ముకుందా! నిన్నటిసమరంబున నిరుబలంబులును సమంబుగాఁ బోరినవి. నేటిసమరమున జయ మెవ్వనికిలభించునో గదా?

ముకుం—నిర్ణయముగావించుటకు మన మెంతవారము. నేటియుద్ధ మతి భీకరముగా నుండఁగలదు.

సంజ—అది మాత్ర మెట్లు వచింపఁగలవు.

ముకుం—నిన్నటిరేయి దుర్యోధనుఁ డంగరాజు నుత్సాహపరచుచు రేపటిదినంబున కిరీటి నోడింపవలసిన దని నుడివెను. అంగరాజు రేపటితో యుద్ధమును ముగింపుజేసెద నని పల్కియున్నాఁడు.

సంజ—అతిరథశ్రేష్ఠులైన కర్ణార్జునుల ద్వంద్వయుద్ధమును కనులార దిలకించు నవకాశము లభించును గదా?

ముకుం—అదేమి? యర్జునునితోఁ దలపడుటకు కర్ణునకు మారుగా నశ్వత్థామ త్వరపడుచున్నాఁడేమి?

సంజ—అశ్వత్థామ దలపడుటయే తడవుగా రథాశ్వములవలె నతివేగము వెనుక కరుగుచున్నాఁడు.

ముకుం—అద్దిరా! కర్ణుని ఔదార్యము. గురుపుత్రుని వెన్నాడుచున్న యర్జునునిపై మత్తమాతంగముపై కురుగు హర్యక్షము తెఱంగున మార్కొని పోరాడుచున్నాఁడు.

[తెరలో] ధనంజయా! నీమగటిమియెట్టిదో నేడు కనుగొనకుండ విడువను. రమ్ము! గురుపుత్రునితో నరిసేయుట గాదు.

సంజ — కృష్ణుఁడు రాధేయున కభిముఖునుగా దేరునడపుచున్నాడు. ముకుందా! ఇంక నీదృష్టి చెదరనీయకుండ నావంకకే దిలకించుచుండుము.

ముకుం — రాధేయుండదే బాణవర్షమున కృష్ణార్జునుల నొప్పించుచున్నాఁడు.

సంజ — కృష్ణుఁ డెంత నేర్పరియో దిలకించితివా! మెఱుపుమెఱసిన చందమున రథము ననేక చిత్రగతుల నడపుచున్నాఁడు. కర్ణుఁడేసిన బాణములన్నిటిని వమ్మగునట్లు జేయుచున్నాడు.

ముకుం — అదే దూరముననుండి దుర్యోధనుఁడు దన సైన్యములన్నియు సూతినందనునకు దోడ్పడవలసినదని హెచ్చరించుచున్నాడు

సంజ — ఆపల్కులాలించియే కౌరవులును నకుల సహదేవులు కడుంగడు వేగమున నర్జునిని తేరుకడ కరుదెంచి చక్రరక్షకులై యున్నారు.

ముకుం — నేఁడదేమోగాని కిరీటి కడుంగడు బడలియున్నట్లుగా గాన్పించుచున్నాఁడు.

సంజ — పదునారు దినంబులనుండి యొక్కరుసను పోరాడుటచే నట్లుండెనేమో?

ముకుం — అదే కర్ణుఁడు దివ్యాస్త్రప్రయోగము గావించుచున్నాఁడు. కార్చిచ్చునుబోలిన మంటలెల్లెగయుచున్నవి!

సంజ — ధనంజయుని వారుణాస్త్రమున నన్నియును చల్లార్పబడినవి గదా?

ముకుం — కిరీటి యంతతో నూరకుండక పదునార్గణంబుల శల్యుని యును పదిబాణంబుల కరుని నొప్పించినాడు.

సంజ — కర్ణు చాతుర్యము దిలకించితివా? యొక్కబాణమున నర్జునుని వింటినారి ఖండించెను.

ముకుం—అదియునుగాక నెడతెరిపిలేకుండునట్లుగా నర్జునుని నొప్పించు చున్నాఁడు.

సంజ—ధనువును సవరించుకొని మరల బాణములను వాయువ్యాస్త్రమున నెగురగొట్టుచున్నాఁడు

[తెరలో]

కృష్ణా! దేవకీనందనా! నేడు కర్ణునితో పోరొనరించుట దుష్కరముగానున్నది.

గీ. పట్టపగటింటి సూర్యుని ♦ పగిది కర్ణుఁ
డుగ్రమూర్తియై వెలుగుచు ♦ నున్నవాఁడు
మనరథంబిప్డు మాధవా ♦ మరల నిమ్ము
బ్రతికియుండిన శుభములు ♦ బడయవచ్చు.

సంజ—(నవ్వుచు) అర్జునుఁడు రథమును వెనుకకు ద్రిప్పుమనుచున్నాడు. భళీ! కర్ణా! నీవే వీరాధికుఁడవు మహాభారతరణంబున పోరాడిన శూరాగ్రేసరులలో నిన్నే చేర్కొనవలయును.

ముకుం—కర్ణార్జునులు శిబిరములవంక కరుగుచు భీమసేనుని యుద్ధమొనరింపమనిగాబోలును నియోగించుచున్నారు. కనుగొంటివా?

సంజ—కర్ణుఁడు కిరీటి నేల వెనుకొనకున్నాఁడో గదా?

ముకుం—భీమదుర్యోధనులు పోరాటమును దిలకించియుండెను గాబోలు నావంక కరుగుచున్నాఁడు.

సంజ—రమ్ము! ఈప్రక్కను గూర్చున్నచో యవ్వలివంక జరుగుచున్న యుద్ధమావంతయు గాన్పింపకున్నది. ఆప్రక్క కేగినచో నెల్లరును కనుగొనవచ్చును.

(ఇరువురును నిష్క్రమింతురు.)

తెర పడును.

---

[తెరలో]

ఓయీ! ఈసముప్రదేశమున రథము నిల్పి కృష్ణార్జునులు నా కెదురుగా నుండునట్లు గావింపుము. అర్జునా! అటుపోయెద వేల? ఈసమతలంబు యుద్ధమున కెంతయు ననుకూలముగా నున్నది రమ్ము.

ముకుం—అదే యర్జునుఁడు గూడ వెనుదిరుగుచున్నాడు. వెనుదిరుగుట యే గాదు బాణములతోడనే ప్రత్యుత్తర మొసంగుచున్నాడు.

సంజ—అదేమి? శ్రీకృష్ణుఁడు గుర్రములను వారించి రథము నొక్క యెడ నిలుపకున్నాడు.

ముకుం—రథము నిలుపకున్న మాత్రమున నర్జునునకు నష్టముకలుగునా? సవ్యసాచి యను నామమును సార్థకముగావించుకొను నట్లుగా బాణముల ప్రయోగించుచున్నాడు.

సంజ—కర్ణుఁడు దమ కిరువురకును నడుమ నెంతయో దవ్వు లేకుండుటచే వెనుక కిట్లురు బెంచుచున్నాఁడు.

[ప్రవేశము:—కర్ణుఁడు.]

కర్ణు—(తనలో) దివ్యాస్త్రప్రయోగమున గాని యీతఁడు వధ్యుఁడు గాడు. (వింట బాణమును సంధించి వదలి) ఈసర్పశిలీముఖ మాతని యసువుల గొనును. (త్వరితముగ లోని కరుగును)

ముకుం—హా హా! ఇవేమి? ఈసర్పము లెందుండి వచ్చినవి.

సంజ—కర్ణుని బాణసంజనితములు. ఆవంకజూడుము. కృష్ణుఁడు రథమును చరాలున భూమిలోనికి దిగద్రొక్కినాడు. అర్జునుని కిరీటము దవ్వులకెగినది.

ముకుం—ఈసర్పముల నాగ్రద్దలు గొనిపోవుచున్నవే గారుడమును యర్జునుఁడు ప్రయోగించినట్లున్నాఁడు.

సంజ—ఇదే ఈపక్కనుండి శ్రీకృష్ణుఁడు రథమునిట్లు దోడ్కొని వచ్చు చున్నాఁడు.

[ప్రవేశము:—కృష్ణార్జునులు.]

అర్జు—కిరీటమును గొట్టుట శిరమును గొట్టుటయే యని తలంపవలసి యున్నది.

కృష్ణ—ఇందులకు సందేహమా!

అర్జు—బావా! రథమును నీవెల గొనివచ్చితివి.

కృష్ణ—ఆ రహస్యమును తరువాతి చెప్పెదను లెమ్ము.

సంజ—కర్ణుఁడు రథమును దిప్పవలసినదని శల్యున కాజ్ఞాపించు చున్నాఁడు.

కృష్ణ—బావా! ఈసమయమున నేనుజెప్పినట్లు జేయవలయునే గాని యదియెందులకు జేయవలయునని మాత్రము ప్రశ్నింపకుము. అదే కర్ణుఁ డభిముఖుఁడై యున్నాఁడు. దివ్యాస్త్రములకు పని గల్గింపుము

అర్జు—(ఒకటి వెంబడి నొకటిగా బాణముల వదలుచుండును.)

ముకుం—అదేమి కర్ణుని రథచక్రము భూమిలో దిగబడిపోయినది.

సంజ—దిగబడలేదు. నెఱియలో బడినట్లున్నది. పాపము చక్రరక్షకులు సమీపమున లేరు.

ముకుం—శల్యుఁడేమో యనుచున్నాఁడే!

[తెరలో]

అంగరాజా! రథచక్రము భూమిలోనికి దిగబడినది. లేవనెత్తిన గాని రథము నడువజాలదు.

సంజ—అదే కర్ణుఁడు డిగ్గున నేలకురికి చక్రము నెత్తుచున్నాఁడు—కాని లాభము లేకున్నది.

కృష్ణ—బావా! బాణప్రయోగమును మాత్రము నిలుపుచేయకుము.

[తెరలో] అర్జునా! ఒక్క క్షణకాల మాగుము.

చ. విరథుడనైన నాపయిని ♦ వేయకు బాణ మొకింత సేపు యీ యరదము లేవనెత్తు వర♦కైనను నిల్పుము. ధర్మమందు సు స్థిరతను నిల్పు మీ వెఱచి ♦ జెప్పినమాటలు గాపటంచు నీ విరయుము శూరధర్మమును ♦ పాలనసేయ గదోయి యర్జునా.

అర్జు—(బాణముల వేయుట చాలించును.)

కృష్ణ—అర్జునా! వేయుము. పాశుపతంబును ప్రయోగించుము.

అర్జు—అధర్మము కాదా?

కృష్ణ—ధర్మాధర్మములు తరువాత చర్చింతము. ధార్తరాష్ట్రులు కావించినవన్నియు ధర్మబద్ధములేనా?

అర్జు—(బాణమును సంధించును) చేత బాణములులేనివాని వధించుటెట్లు?

కృష్ణ—అదే కర్ణుడు నోటితో బాణమును లాగి వదలుచున్నాడు. నీవు బాణమును సంధించుట జూచియే యాతడట్లు గావించుచున్నాడు. ఇంక బాణమును విడువుము.

అర్జు—బాణమును విడచును.

[తెరలో] హా! హా!!

ముకుం—అదే కర్ణు డస్తమించెను. పార్థుని యస్త్రమాతని ప్రాణము మును ప్రయ్యలుగావించెను.

కృష్ణ—అర్జునా! రమ్ము. కర్ణుని సమీపింతము.

(ఇరువురును పరిక్రమింతురు.)

[రథముప్రక్కను మూర్ఛితుడై కర్ణుడు పడియుండును.]

కృష్ణ—(కర్ణుని సేదదీర్చుచు) అంగరాజా! అంగరాజా!!

కర్ణ—(కండ్లుదెరచి) కృష్ణా వచ్చితివా! నాకిక దివ్యలోకమున కరుగ నాజ్ఞ యొసంగుము.

కృష్ణ—అంగరాజా! నీవే వీరుడవు. నేటినుండియు నీవు దానకర్ణుడవనియు, వీరాగ్రేసరుడవనియు లోకులెల్ల రాచంద్రతారార్కము నుతించుచుందురు. నీకు నాసాయుజ్యమొసంగితిని.

[దేవతలు పుష్పవర్షమును కురియింతురు.]

అర్జు—బావా! ఇదేమి?

కృష్ణ—ఈతడు తొల్లి సహస్రకవచుడను వాడు. ఈతనిచే ముల్లోకము లుత్తలపడియుండెను. ఈతని కవచములలో నొక్కటి దక్కగ నన్నింటి నీవరకు నరనారాయణులమై భేదించియుంటిమి. ఇపు డీతనిని వధింపగలిగితిమి. ఆసంతసమున దేవతలు పుష్పవృష్టి కురియుచున్నారు.

కర్ణ—కృష్ణా అనుగ్రహింపుము.

కృష్ణ—ఇంకను నీవాంఛిత మెద్ది?

కర్ణ—మహాత్మా!

భరతవాక్యము.

గీ. ధరణిపతులెల్ల కాలంబు • ధర్మబుద్ధి
గలిగి ప్రజలను కన్నబిడ్డల విధాన
నరయుదురు గాక, సస్యాఢ్య • యగు ధరణి
యెపుడు చెలువందగ ననుగ్రహింపుమయ్య.

కృష్ణ—తథాస్తు.

(కర్ణుడు మరణించును.)

కృష్ణ—అర్జునా! ఇంక నిచ్చట నిలుచు టెందులకు? ధర్మతనయున కీవార్త వినిపింతము రమ్ము.

(నిష్క్రమింతురు)

సంపూర్ణము.

# అనుబంధము.

7 పేజి—8 పంక్తి.

(డు—

ఎట్టులనైతు నీయవమానము
వడమ్ముండిపల్కులు - హృదయము పగులగ
జేయుచు నుండగ - నేవిధమున నీ॥ ఎ॥
కులహీనుడనని - కేరడమాడుచు
ప్రకటించిరిగా - సభలోనన్
తుచ్ఛజీవముల - తో యవమానము
బడసి బ్రతుకుటే - మనుగడఫలమా॥ ఎ॥

---

పేజి 7—25 పంక్తి.

ాతుడు—

చింతిలనేలా? కుమారా!
అంగరాజ్యమున - కభిషిక్తుడవై
యలరుచుండ కిటు॥ చింతి॥
సంతసింపగా దగు - సమయంబున
కలతజెంది యే - కతమున నిట॥ చిం॥
అభిషిక్తుడవై - యరుదెంచిన నిను
గనుగొన నెంచిన - జననిని జూడక॥ చిం॥

పేజి 14—18 పంక్తి.

కర్ణుఁడు—

ధన్యుడ నైతినిగా
మహాత్మా మీవలన - ధన్యుడ నైతినిగా॥ ధ॥
పరమకృపతో - పరికించెద మని
పలికి బ్రోచితిరి - పరమపురుష నే॥ ధ॥
తమపరి చర్యల - సలుపుచు విద్యను
అభ్యసింపగ నా - కానతిచ్చితిరి॥ ధ॥

---

పేజి 20—15 పంక్తి.

పరశురాముడు—

కుటిలహృదయమున - నిటులరుదెంచితివా
కల్లలాడి నాకడ వి - ద్యల నభ్యసింపగను॥ కు॥
నిక్కమెల్ల నా - కెఱుక జేయక
విధ నలయించిన - నిను విడుతునె శపింపక॥ కు॥

---

పేజి 23—18 పంక్తి.

చండిక—

కోటివందనరూపు డితని
గూడకున్న తను వదేలగా
వెడదయైన - దనియురమునం దోకింత
విశ్రమింప నోచుకొనని - వెలది జీవమేలగా॥ కో॥
కౌతుకమున నితనిబట్టి - కౌగిలించి సుఖింప
క్షణములోన పరమసుఖము - గాంచగలముగా॥ కో॥

ఇతనిరూప మెంత గనిన - వించుకంత తనివిగనదు
చిత్త మతనిమీద బుద్ధి - చెదరకుండ నాఫుచుంచె హా॥ కో॥

---

పేజి 24—14 పంక్తి.

అత్త—

ఓసి పాడుముండ యింటికే రాక యిచట
ఎవడితోడ యేచ్చుచుంటివే॥ ఓ॥
చీకటింట లేచి క్రొత్త చీర గట్టి వీధిబట్టి
విటులతోడ ముచ్చటాడుచుంటివా॥ ఓ॥
పారుబోతదాన నిన్ను బట్టి కొట్టినా
వినక దిరుగు నిన్ను కాల్చివిడతునే॥ ఓ॥

---

పేజి 43—21 పంక్తి.

కర్ణుడు—

ఇది తగునా? జననీ?
మానధనుడనై - మనుచుండిన నను
ఈయకార్యము - నొనరింపుమని పలుక తగునా?॥ ఇది॥
పిన్నటినుంటియు - నన్నే నమ్మికొని
యున్నసుయోధను - నే డిటు విడచుట। తగునా?॥ ఇది॥

---

పేజి 73—4 పంక్తి.

కర్ణుడు—

అర్థిని బొమ్మనగలనా॥ నే॥
దేహీ యని చే - జాచి యడుగగ
లేదు లేదనుచు నే - బలుకగ జాలా॥ నే॥

అర్థుల కోర్కెల - నరసి తీర్పని
మనుజునిజన్మము - వ్యర్థము కాదా॥ అ॥
ఐహికములకై - యాశ దహింపగ
పర మూహింపక - తనరుట మేలా॥ అ॥

---

పేజి 79—4 పంక్తి.

కర్ణుడు—

తమ వాంఛితార్థమును తడయక తెలుపుడు
మహాత్మా - తడయక తెలుపుడు॥ తమ॥
తమవాంఛితమును నే - తడయక దీర్చెద
సంకోచము మది - నిలుపబోవ కిక॥ తమ॥
ఆడినమాటల తప్పిచరించు - టది యెఱుంగ నికన్
జంకుమాని తమ - కోరిక తెలుపుడు మహాత్మా! ॥ తమ॥

---

పేజి 83—12 పంక్తి.

కర్ణుడు—

దురమునా నరుబల మెట్టిదో నేనర సెద కనుమూ -
బట్టురీతి నీ వాతని బొగడినయంతమాత్రమున -
వెఱతు ననుచు దలచితివే - పగతుర గూల్చెద గనుమా!
మూడులోకముల నీడు - లేదనుచు జనులెల్ల బొగడ
నాకిరీటి నోహటించి త్రుటిగెల్తు గాంతు॥ దు॥

---